శ్రీ

ద్వాదశజ్యోతిర్లింగ స్తోత్ర

# కల్యాణమణిమంజరి

ఆంధ్రానువాద సముల్లసితము

సంపాదన

కరుణశ్రీ

ప్రకాశకులు:

శ్రీ మనికొండ కాశీవిశ్వనాథము

రామాబైండింగ్‌వర్క్సు (రిజిష్టర్డు) విజయవాడ.

# వి ష య సూ చి క

| | |
|---|---|
| విజ్ఞప్తి | 5 |
| మార్గసూచిక | 7 |
| కల్యాణవాణి | 9 |
| శ్రీశివదర్శనము | 45 |
| ద్వాదశజ్యోతిర్లింగములు | 57 |
| జ్యోతిర్లింగ స్తోత్రశ్లోకములు | 59 |
| ఆంధ్రానువాద పద్యములు | |
| శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు | 84 |
| శ్రీ పళ్ళె పూర్ణప్రజ్ఞాచార్యులుగారు | 91 |
| శ్రీ దోమా వెంకటస్వామిగుప్తగారు | 95 |
| శ్రీ ముదిగొండ వీరభద్రమూర్తిగారు | 99 |
| శ్రీ వావిలాల సోమయాజులుగారు | 104 |
| శ్రీ టి. భాస్కరరావుగారు | 111 |
| శ్రీ అక్కిరాజు వేంకటేశ్వర శర్మగారు | 115 |
| శ్రీ బొడ్డు బాపిరాజుగారు | 122 |
| శ్రీ మల్లంపల్లి వీరేశ్వరశర్మగారు | 126 |
| శ్రీ కంభంపాటి రామగోపాలకృష్ణమూర్తిగారు | 133 |
| శ్రీ పి. వేంకట గోపాలరావుగారు | 137 |
| శ్రీ ధనకుధరం వేంకటాచార్యులుగారు | 141 |
| శ్రీ కరుణశ్రీ గారు | 145 |
| అనువాదకుల పరిచయము | 152 |

కలాభ్యాం చూడాలంకృతశశికలాభ్యాం నిజతపః
ఫలాభ్యాం భక్తేషు ప్రకటితఫలాభ్యాం భవతు మే
శివాభ్యామస్తోకత్రిభువనశివాభ్యాం హృది పున
ర్భవాభ్యామానందస్ఫురదనుభవాభ్యాంనతిరియమ్॥

జగద్గురు శంకర భగవత్పాదాః




జగద్గురు
శంకరభగవత్పాదులు



శ్రీ మనికొండ కాశీవిశ్వనాథము
ఏతద్గ్రంథ ప్రకాశకులు - ప్రచారకులు

# విజ్ఞప్తి

భక్తమహాశయులారా!

కొంతకాలము క్రిందట పరమపూజనీయులు శ్రీ శ్రీ శ్రీ రామభద్రేంద్రస్వామి వారు జగద్గురు శ్రీమదాదిశంకరభగవత్పాదులచే రచియింపఁబడిన "శ్రీ మద్ద్వాదశజ్యోతిర్లింగస్తోత్రరాజము"ను నాకను గ్రహించి ప్రచారము గావింపు మని ఆజ్ఞాపించిరి. శ్రీవారి యాదేశము శిరసావహించితిని.

సుధామధురహృదయులు సుకవి తల్లజులు నైన కరుణశ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రిగారికి నా మనోభావము నెరింగించితిని. శాస్త్రిగారు నా ప్రార్థనమును అంగీకరించి ఈకార్యభారము నంతయు తామే గైకొని గ్రంథమును ముద్దుగా దిద్దితీర్చి 'కల్యాణవాణి' పలికిరి. అందులకువారికి నా కృతజ్ఞతా పూర్వక నమస్కారములు.

నావిన్నపమును మన్నించి మూలశ్లోకములకు అనువాదకవితలు ప్రసాదించిన మహాకవులు 'కవి సమ్రాట్' శ్రీ విశ్వనాథ సత్యనారాయణ, 'కవి శేఖర' మధ్వశ్రీ పళ్లె పూర్ణప్రజ్ఞాచార్యులు, శ్రీ ముదిగొండ వీరభద్రమూర్తి, శ్రీ వావిలాల సోమయాజులు, శ్రీ టి. భాస్కరరావు, శ్రీ అక్కిరాజు వేంకటేశ్వర

శర్మ, (శ్రీ) బొడ్డు బాపిరాజు, (శ్రీ) మల్లంపల్లి వీరేశ్వర శర్మ, (శ్రీ) కంభంపాటి రామగోపాల కృష్ణమూర్తి, (శ్రీ) పినపాల వేంకట గోపాలరావు, (శ్రీ) ధనకుధరం వేంకటాచార్యులు, కరుణశ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రి గార్లకు నా హృదయపూర్వక ధన్యవాదములు సమర్పించుకొనుచున్నాను.

నాయందుగల అపారవాత్సల్యముతో నేను కోరినంతనే "(శ్రీ)శివదర్శనము" ప్రసాదించిన మహోపాధ్యాయులు, సాహిత్యసమ్రాట్టులు బ్రహ్మశ్రీ జమ్ముల మడక మాధవరామ శర్మగారికి నా భక్తిపూర్వక ప్రణామములు.

ద్వాదశ పుణ్యక్షేత్రములయందు వెలసియున్న జ్యోతిర్లింగాకృతులను కన్నులపండువుగా చిత్రించిన మిత్రులు శ్రీ వి. కామేశ్వరరావుగారి ఆదరమును నేను మరువజాలను.

జగజ్జనకులైన పార్వతీ పరమేశ్వరుల లీలా విశేషములను వ్యక్తీకరించు ఈ గ్రంథరాజమును భక్త మహాశయుల కరకమలములయం దుంచుచున్నాను.

బుధజన విధేయుడు,

**మనికొండ కాశీవిశ్వనాథము.**



క్రొత్తగుళ్ళలోని శివాలయ ముఖమంటపములో ఉత్తర కుడ్యమున శ్రీ ద్వాదశ జ్యోతిర్లింగస్తోత్ర చంద్ర శిలాఫలకములను ఆవిష్కరించిన సందర్భములో శ్రీశ్రీశ్రీ రామభద్రేంద్ర సరస్వతీ స్వామివారితో శ్రీ కాశీవిశ్వనాథం వారి జ్యేష్ఠ పుత్రుడు చి॥ శంకరనారాయణరావు



మహాగ్రంధావిష్కరణ సందర్భములో మామగారికి అండదండగా నిలిచిన
అల్లుడు మేనల్లుడు
చిరంజీవి మురికిపూడి వేంకట్రామయ్య

# మార్గసూచిక

[శ్రీ మనికొండ కాశీవిశ్వనాథము ద్వాదశ జ్యోతిర్లింగ మహాక్షేత్రములను సందర్శించిన సందర్భమున అనుసరించినది.]

శ్రీ సోమనాథజ్యోతిర్లింగము :

విజయవాడనుండి బయలుదేరి బొంబాయి మీదుగా అహమ్మదాబాద్ వెళ్ళవలెను. అచ్చటినుండి వీరావల్ వెళ్లి సోమనాథ క్షేత్రమున కరుగవచ్చును.

శ్రీ మల్లికార్జున జ్యోతిర్లింగము :

విజయవాడనుండి మార్కాపూర్‌కు రైలుమీద ప్రయాణముచేసి, అక్కడినుండి శ్రీశైలమునకు బస్సుపై వెళ్లవచ్చును. గుంటూరునుండిబస్సు సౌకర్యము కలదు.

శ్రీ మహాకాళ జ్యోతిర్లింగము :

విజయవాడనుండి జి. టి. లో ఢిల్లీ వెళ్లు మార్గములో భోపాల్ వద్ద దిగి, అచ్చటినుండి ఉజ్జయిని వెళ్లవలెను.

శ్రీ ఓంకారేశ్వర జ్యోతిర్లింగము :

విజయవాడ నుండి ఇటార్సీ వెళ్లి, అక్కడి నుండి బొంబాయి వెళ్లుమార్గములో ఖాండ్వాలో దిగి, అటనుండి అజ్మీరు వెళ్లుబండిలో 'ఓంకారేశ్వర్ రోడ్డు' దిగవలెను.

శ్రీ కేదారేశ్వర జ్యోతిర్లింగము :

విజయవాడనుండి ఢిల్లీ మీదుగా హరిద్వార్ వెళ్ళవలెను, అటనుండి హృషీకేశము వెళ్లి, అటనుండి 'కుండీ చట్టీ' వరకు బస్సు. 'కుండీచట్టీ'నుండి 26 మైళ్ళు నడచి కేదారము వెళ్లవలెను.

శ్రీ భీమశంకర జ్యోతిర్లింగము :

విజయవాడ నుండి బొంబాయి వెళ్లుమార్గములో పూనాలో దిగవలెను. పూనానుండి నాసిక్ వెళ్లు బస్సులో 'మంచర్'లో దిగి కారుమీద భీమశంకర్‌కు వెళ్లవలెను.

శ్రీవిశ్వేశ్వర జ్యోతిర్లింగము :

విజయవాడనుండి ఇటార్సీమీదుగా కాశీ వెళ్లవలెను.

శ్రీ త్ర్యంబకేశ్వర జ్యోతిర్లింగము :

విజయవాడనుండి బొంబాయి మీదుగా నాసిక్, నాసిక్ నుండి కారుమీద త్ర్యంబకం వెళ్లవచ్చును.

శ్రీ వైద్యనాథ జ్యోతిర్లింగము :

విజయవాడనుండి ఇటార్సీ మీదుగా వారణాసి వెళ్లి, అటనుండి గయమీదుగా జసిడి వెళ్లవలెను. జసిడి నుండి వైద్యనాథమునకు వెళ్లవలెను.

శ్రీ నాగనాథ జ్యోతిర్లింగము :

విజయవాడనుండి బొంబాయి మీదుగా అహమ్మదాబాద్ వెళ్లి, అక్కడినుండి ద్వారకకు వెళ్లవలెను. నాగనాథస్వామి క్షేత్రము ఇక్కడకు 13 మైళ్లలో నున్నది.

శ్రీ రామేశ్వర జ్యోతిర్లింగము :

విజయవాడనుండి రైలులో మద్రాసు మీదుగా రామేశ్వరము చేరవలెను.

శ్రీ ఘుశ్మేశ్వర జ్యోతిర్లింగము :

విజయవాడనుండి సికింద్రాబాద్ మీదుగా ఔరంగాబాద్ వెళ్లి, అక్కడినుండి ఎల్లోరాకు వెళ్లు మార్గమధ్యము నందే ఘుశ్మేశ్వర క్షేత్ర మున్నది.



దుర్గాష్టమినాడు శ్రీ శ్రీ శ్రీ రామభద్రేంద్ర సరస్వతీస్వామివారి పర్యవేక్షణలో సమావేశమైన వేదపండిత సమ్మానసభలో పుత్ర పౌత్ర దౌహిత్ర జామాతృ సమేతముగ

శ్రీ మనికొండ కాశీవిశ్వనాథంగారు



మధ్య : (శ్రీ) కాశీవిశ్వనాథము దంపతులు.

ఎడమ: శ్రీ కాశీవిశ్వనాథముగారి అక్క 'దుర్గాంబగారు. కుడి: శ్రీకాశీవిశ్వనాథముగారి రెండవ అక్క వీరరాఘవమ్మగారు.

# కల్యాణవాణి

## "కరుణశ్రీ"

భారతావని పుణ్యక్షేత్రములకు పుట్టినిల్లు. ఈ పవిత్ర భూమిలో సుప్రసిద్ధములైన ఇరువదియొక్క మహాగణేశక్షేత్రములు, ఏబదియొక్క శక్తిపీఠములు, ఏబదియొక్క సిద్ధక్షేత్రములు, నూటయెనుబది విష్ణుక్షేత్రములు, నూటయెనుబది శివక్షేత్రములు విరాజిల్లుచున్నవి. మఱియు నీ పుణ్యభూమి "అయోధ్య, మధుర, మాయా, కాశి, కాంచి, అవంతిక, ద్వారక" అను మోక్షప్రదములగు సప్తపురములతో నలరారుచు, పంచకాశీ, సప్తగంగా, సప్తబదరీ, చతుర్దశ ప్రయాగలతో విలసిల్లుచు గంగా, యమునా, గౌతమీ, కృష్ణవేణీ, పినాకినీ, కావేరీ ప్రముఖ పుణ్యతరంగిణీ తరంగములతో పరమ పావనమై యొప్పుచున్నది. తమిళగ్రంథ మగు పెరియపురాణమున రెండువందల డెబ్బదినాలుగు పవిత్ర మహాశైవక్షేత్రములత్యద్భుతముగ నభివర్ణింపబడినవి.

### సర్వం శివమయం జగత్ :

చరాచరప్రపంచ మంతయు శివమయము. ఈ విశాలవిశ్వమున శివుఁడు కానిదేదియు లేదు. ఈ సమస్తసృష్టియు పంచభూతములతో నిండియున్నది. "పృథివి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము, జీవాత్మ, సూర్యుఁడు, చంద్రుఁడు—" ఇవి పరమశివుని అష్టమూర్తులు. శర్వ, భవ, రుద్ర, ఉగ్ర, భీమ, పశుపతి, మహాదేవ, ఈశాన నామములతో పృథివ్యాది అష్టమూర్తుల నధిష్ఠించి పరమేశ్వరుఁడు ప్రపంచమును పాలించుచున్నాఁడు.

### పంచభూతాత్మక శివలింగములు :

కాంచీక్షేత్రములో పృథ్వీలింగరూపమున, జంబుకేశ్వరక్షేత్రములో జలలింగరూపమున, అరుణాచలక్షేత్రములో తేజోలింగ

రూపమున, శ్రీకాళహస్తి క్షేత్రములో వాయులింగ రూపమున, చిదంబర క్షేత్రములో ఆకాశలింగరూపమున దయాసముద్రుఁడగు స్వామి సన్నిధిచేసి యున్నాడు. ఈశాన, తత్పురుష, అఘోర, వామదేవ, సద్యోజాత నామకములగు పరమశివుని పంచబ్రహ్మ మూర్తులు బ్రహ్మాండపరివ్యాప్తములై సకలలోక కల్యాణప్రదములై సర్వార్థసందాయకము లగుచున్నవి.

ద్వాదశ జ్యోతిర్లింగములు :

పరమశివుఁడు కరుణామయుఁడు. ఆయన ఆర్తులకు సన్నిధి. ఆశ్రితులకు పెన్నిధి. ఆపన్నులకు ముంగొంగుబంగారము. దేవాది దేవుఁడైన మహాదేవుడు ద్వాదశ జ్యోతిర్లింగ స్వరూపములతో ఆసేతు శీతాచలము భారతభూమిలో భక్తజనపరిపాలనార్థమై యవత రించి భుక్తిముక్తుల ననుగ్రహించుచున్నాడు.

సౌరాష్ట్రమున సోమనాథుఁడై, శ్రీశైలమున మల్లికార్జునుఁడై, ఉజ్జయినిలో మహాకాళుఁడై, ఓంకారమున పరమేశ్వరుఁడై, హిమా చలమున కేదారనాథుఁడై, డాకినియందు భీమశంకరుఁడై, వారణా సిలో విశ్వేశ్వరుఁడై, గౌతమీతీరమున త్ర్యంబకేశ్వరుఁడై, చితాభూ మియందు వైద్యనాథుఁడై, దారుకావనమున నాగనాథుఁడై, సేతుబం ధమున రామేశ్వరుఁడై, శివాలయమున ఘుశ్మేశ్వరుఁడై, సర్వలోక శుభంకరుడగు శంకరుఁడు విజయంచేసియున్నాడు. పరమశివ సన్నిధా నములగు నీ పన్నెండు పుణ్యస్థానములు ద్వాదశ జ్యోతిర్లింగ క్షేత్ర ములుగా యుగయుగములనుండి ప్రసిద్ధిగాంచియున్నవి. ఈ ద్వాదశ జ్యోతిర్లింగ క్షేత్రమహిమ 'శివపురాణము' నందలి 'కోటి రుద్ర సంహిత' యందు మనోహరముగ వర్ణితమైనది.

శ్లో॥ సౌరాష్ట్రే సోమనాథంచ శ్రీశైలే మల్లికార్జునమ్
ఉజ్జయిన్యాం మహాకాళ మోంకారే పరమేశ్వరమ్ ॥

కేదారం హిమవత్పృష్ఠే డాకిన్యాం భీమశంకరమ్
వారాణస్యాంచ విశ్వేశం త్ర్యంబకం గౌతమీతటే ॥
వైద్యనాథం చితాభూమౌ నాగేశం దారుకావనే
సేతుబంధేచ రామేశం ఘుశ్మేశంచ శివాలయే ॥
ద్వాదశైతాని నామాని ప్రాతరుత్థాయ యః పఠేత్
సప్తజన్మకృతం పాపం స్మరణేన వినశ్యతి ॥
యం యం కామ మపేక్ష్యైవ పఠిష్యంతి నరోత్తమాః
తస్య తస్య ఫలప్రాప్తి ర్భవిష్యతి న సంశయః ॥
ఏతేషాం దర్శనాదేవ పాతకం నైవ తిష్ఠతి
కర్మక్షయో భవేత్తస్య యస్య తుష్టో మహేశ్వరః ॥

పైనచెప్పబడిన ద్వాదశజ్యోతిర్లింగక్షేత్రమహాత్మ్య మనన్య సామాన్యము. ఎవఁడు ప్రాతఃకాలమున లేచి యీ పన్నెండు నామములను స్మరించునో వానికి శివానుగ్రహము కల్గును. సప్తజన్మకృత దుష్కృతము నశించును. ఎవరేది వాంఛించి వీనిని పఠింతురో వారి కావాంఛితము సత్వరము సిద్ధించును. ఈ పుణ్యక్షేత్ర సందర్శనము సకల దురిత హరము. పరమేశ్వర ప్రీతికరము.

## సౌరాష్ట్రే సోమనాథంచ

క్షేత్రమహిమ :

పరమేశ్వరుని జ్యోతిర్లింగములలో మొట్టమొదటిది శ్రీసోమనాథ జ్యోతిర్లింగము. ఈజ్యోతిర్మూర్తి సౌరాష్ట్రదేశములో పరమపవిత్రమైన ప్రభాసక్షేత్రమున వెలుఁగొందుచున్నది. ప్రభాసక్షేత్ర మహిమ మహాభారతమునందు, మహాభాగవతమునందు, స్కాందపురాణమునందు, ననేకవిధముల నత్యద్భుతముగ నభివర్ణింపఁబడియున్నది.

పురాణకథ :

దక్షప్రజాపతికి ఇరువది ఏడుగురు కుమార్తెలు జన్మించిరి. అందరు చక్కనిచుక్కలు. ఆయన తన తనయలను సౌజన్యరాశియు సౌందర్యమూర్తియునగు చంద్రునకిచ్చి మహావైభవముగా వివాహము గావించినాడు. భార్యలందరిలోను 'రోహిణి' త్రిభువనమోహిని. చంద్రునకు ప్రాణము. ఇది మిగిలినవారికి అసూయాజనకమైనది. ఈర్ష్యాళువులైన దక్షపుత్రికలు ఇరువది ఆర్గురును తండ్రిదగ్గరకు వెళ్ళి తమ దైన్యమును విన్నవించుకొనిరి. దక్షుఁడు నక్షత్రనాథుని పిలిపించి, సతీమణుల నందరిని సమానప్రేమతో నాదరింపుమని పలు విధముల ప్రబోధించెను. కాని మామగారిమాటలు చంద్రుని మనసున కెక్కలేదు. అతడు యథాపూర్వముగ రోహిణి యెడలనే అత్యంతానురక్తుడై మెలగుచుండెను. అంత దక్షుడు కోపోద్రిక్తుడై చంద్రుని "క్షయరోగపీడితుడవుకమ్ము" అని భయంకరముగ శపించెను.

కళాసాంద్రుఁడగు చంద్రుఁడు శాపవశమున క్రమముగా కళావిహీనుఁడు కాఁజొచ్చెను. సుధాకరుని సుధాకిరణములు నీరసించినవి. అమృతాహారు లగు అమరులు హాహాకారములు చేయసాగిరి. ఓషధులు వాడినవి. లతలు కాంతి వీడినవి. చరాచరసృష్టి నిస్తేజమైనది. ఇంద్రాదిదేవతలు, వశిష్ఠాది మునీంద్రులు చంద్రుని ముందిడుకొని బ్రహ్మదేవుని సన్నిధికి పోయిరి. ఈ మహోపద్రవమునుండి ముల్లోకముల రక్షింపుమని వేడుకొనిరి. వారి ప్రార్థన లాకర్ణించి విధాత "చంద్రా! పవిత్రమైన ప్రభాసతీర్థమునకు వెళ్ళి పరమశివు నారాధింపుము. నీకు శుభముకలుగు"నని యతనికి మృత్యుంజయమంత్ర ముపదేశించి పంపించెను.

పితామహుని యుపదేశానుసారము చంద్రుడు దేవగణముతోఁ గూడి ప్రభాసక్షేత్రమున కేగి మహానిష్ఠతో మహేశ్వరు నారాధించెను. ఆఱుమాసములకాలము ఘోరతపస్సు కొనసాగించెను. ఏక

దీక్షతో పదికోట్ల పర్యాయములు మృత్యుంజయ మహామంత్రమును జపించెను. భక్తవశంకరుఁడు శంకరుఁడు చంద్రునిముందు సాక్షాత్కరించి "చంద్రా! నీ భక్తికి మెచ్చితిని. వరము ననుగ్రహింప వచ్చితిని. ఇక నీ తపస్సు చాలింపుము" అని పల్కెను. చంద్రుఁడు జగదీశ్వరునకు సాష్టాంగ ప్రణామము లొనర్చి "స్వామీ! ధన్యుఁడను. కృతార్థుఁడను. నాయందు తమ కరుణ కలిగినది. ఇంతకంటె నాకు కావలసిన దేమున్నది. నన్ననుగ్రహింపుము. నీకరుణాకటాక్ష వీక్షణముల నాపైఁ బ్రసరింపఁజేసి నా శాపము నివర్తింపఁజేయుము. నన్ను క్షమింపు"మని ప్రార్థించెను. కరుణామయుఁడైన మహేశ్వరుఁడు అతని ప్రార్థనను మన్నించి "కృష్ణపక్షములో మాత్రము నీ కళలు క్షీణించును. కాని శుక్లపక్షమున నీ కళలు దినదిన ప్రవర్ధమానము లగును. పూర్ణిమనాడు నీవు షోడశకళాపరిపూర్ణుఁడవై విరాజిల్లెద"వని వరప్రదాన మొనర్చెను.

జగత్పతి మృతతుల్యుఁడైన చంద్రున కీవిధముగ మరల అమరత్వమును ప్రసాదించెను. పరమశివుని వరప్రభావమున కళాహీనుఁడు కళానిధియై కళాప్రపూర్ణుఁడై కళకళలాడెను. ఎప్పటివలె అమృతవర్షము కురిపించెను. నయనాభిరాముఁడగు సోముని సుధాకిరణములచే సర్వప్రపంచము సజీవమై సర్వాంగసుందరమై ప్రకాశించెను. బ్రహ్మాది దేవతల ప్రార్థన మన్నించి భక్తవత్సలుఁడైన పరమశివుఁడు పార్వతీ సహితుఁడై ప్రభాసక్షేత్రమున సోమనాథ జ్యోతిర్లింగ రూపములో నేఁటికిని కన్నులవిందుగ సన్నిధిచేసి యున్నాఁడు.

## శ్రీశైలే మల్లికార్జునమ్

క్షేత్రమహిమ :

ఆంధ్రప్రదేశములో పవిత్రకృష్ణవేణీ తీరమున శ్రీశైల క్షేత్రమున్నది. కైలాస పర్వతముతో సమానమైన గౌరవౌన్నత్యములు

కలిగి, సర్వదా దేవబృంద సంసేవ్యమాన మగుటచే శ్రీశైలమునకు "దక్షిణ కైలాస"మని ప్రసిద్ధివచ్చినది. మహాభారతమునందును, శివ పురాణమునందును, పద్మపురాణమునందును శ్రీశైల ప్రశస్తి గలదు. శ్రీశైల మహాక్షేత్రమునకేగి మల్లికార్జునుని సేవించినవారికి అశ్వమేధ యాగఫలము ప్రాప్తించునని భారత ప్రమాణము. సందర్శనమాత్రము ననే సకలపాపములను వికలముచేసి అఖండమోక్ష లక్ష్మీ ప్రసాదము ననుగ్రహించు పుణ్యక్షేత్ర మిది. "శ్రీశైల శిఖరం దృష్ట్వా పునర్జన్మ న విద్యతే." అని పురాణములు ఘోషించుచున్నవి.

పురాణకథ :

గణేశ కార్తికేయులు పార్వతీ పరమేశ్వరుల గారాబు కుమారులు. ఒకదినము వారిరువురి మధ్య వివాహవిషయమున వివాదము వచ్చినది. "నావివాహము ముందు జరుగవలె"నని గణేశుడును, "నా పెండ్లియే మొదట జరుగవలె"నని కార్తికేయుఁడును పరస్పరము వాదించుకొనసాగిరి. భవానీశంకరులు కుమారుల నిరువురను పిలిచి "నాయనలారా! కలహము వలదు. మీ ఇద్దరిలో ఎవరు ముందు భూప్రదక్షిణ మొనర్చివత్తురో వారి వివాహము మొదట జరిగింతు"మని ఒక నిర్ణయముచేసిరి. జననీజనకుల సూచన వినినతోడనే కార్తికేయుఁడు మయూరవాహనము నధిరోహించి వాయువేగ మనోవేగము లతో భూప్రదక్షిణమునకై బయలుదేరెను. పాపము గణపతి స్థూల కాయుడు. ఆయన వాహనము మూషికము. ఆయన క్షణకాల మిటు నటు చూచెను. కొంచెమాలోచించెను. తలపంకించెను. కర్తవ్యమును గుర్తించెను. శరీరము స్థూలమైనను గణేశుని బుద్ధి అతిసూక్ష్మము. ఆయన కొక మంచి యుపాయము తట్టినది.

వినాయకుడు వెనువెంటనే తన తలిదండ్రులదగ్గరకు పరుగిడెను. వారి నిరువురిని ఒకయాసనముపై సమాసీనులగావించెను. జననీజనకుల పాదపద్మములను భక్తిపూర్వకముగ పూజించెను. వారిరువురి చుట్టును

మూడు పర్యాయములు రొప్పుచు, రోజుచు ప్రదక్షిణ మొనర్చి సాష్టాంగనమస్కారముచేసెను. తర్వాత తల్లిని చూచి "అమ్మా! నా వివాహమునకు సుముహూర్తము పెట్టింపుము. ఇప్పటికే కాలాతీతమైనది" అనెను. తనయుని మాటలువిని "అదేమి గణపతీ! భూప్రదక్షిణము చేయుకయే పెండ్లిముహూర్తమా? నీ తమ్మునితోపాటు నీవు కూడ పందెములో పాల్గొని జయమందుము" అన్నది. గణేశుడు చిరునవ్వు నవ్వుచు "అదేనమ్మా! జననీజనకులైన మీ ఇద్దరిచుట్టు నేను మూడుసార్లు ప్రదక్షిణము చేసితినిగదా!

"పిత్రోశ్చ పూజనం కృత్వా ప్రక్రాంతిం చ కరోతి యః
తస్యవై పృథివీజన్యం ఫలం భవతి నిశ్చితమ్"

అని కదా ధర్మశాస్త్రము. నేను ముమ్మారు భూప్రదక్షిణము చేసినవాఁడ నైతిని. అందువలన నిక వివాహముహూర్త నిశ్చయమే మీ కర్తవ్యము" అనెను. పార్వతీ పరమేశ్వరులు పెద్దకుమారుని బుద్ధికుశలతకు లోలోన మెచ్చుకొనిరి. విశ్వరూప ప్రజాపతి పుత్రికలైన "సిద్ధి" "బుద్ధి" అను సుందర కన్యకారత్నముల నిచ్చి గణపతికి కల్యాణము కావించిరి.

భూప్రదక్షిణమునకై వెడలిన కుమారస్వామి కొలదికాలములో తన కార్యక్రమమును ముగించుకొని తిరిగి వచ్చెను. జరిగిన మోసము తెలిసికొనెను. పసుపుబట్టలతో నున్న కల్యాణ గణేశుని గాంచి కార్తికేయునకు పట్టరాని యాగ్రహము వచ్చెను. అతఁడు కోపావేశముతో వెండికొండ విడిచి క్రౌంచపర్వతము (శ్రీశైలము) మీఁద అలిగి కూర్చుండెను. తమ కుమారుని కోపము తీర్చి, వెంటగొని రమ్మని పార్వతీపరమేశ్వరులు నారదమహర్షిని పంపిరి. కలహభోజను డెంతచెప్పినను కార్తికేయుఁడు పట్టినపట్టు విడువలేదు. జగజ్జననియైన ఆ తల్లి హృదయము తనయునికోసము తల్లడిల్లెను. ఉమామహేశ్వరులే కుమారుని కొఱకు స్వయముగా క్రౌంచపర్వతము

మీదకు విచ్చేసిరి. కుమారుని పరిపరివిధముల బతిమాలిరి. కార్తికేయుడు కదలలేదు; మెదలలేదు. వారు పుత్రవాత్సల్యమును వీడలేక పోయిరి. మార్గాంతరమును గానక పరమశివుడు పార్వతీసమేతుడై శ్రీశైలశిఖరముపై నిలచిపోయెను. అదే "శ్రీ మల్లికార్జున" జ్యోతిర్లింగముగ విశ్వవిఖ్యాతిగాంచెను. మల్లికాశబ్దము పార్వతీవాచకము. అర్జునశబ్దము పరమేశ్వర వాచకము. మల్లికార్జును లనగా పార్వతీ పరమేశ్వరులని యర్థము.

## ఉజ్జయిన్యాం మహాకాళమ్

క్షేత్రమహిమ :

మాలవదేశాంతర్గతమైన ఉజ్జయినీ పట్టణములో శిప్రానదీ తీరమున శ్రీమహాకాళేశ్వర జ్యోతిర్లింగము నెలకొని యున్నది. ఉజ్జయినీ నగరమును 'అవంతిక' అనియు నందురు. భారతదేశములోని మోక్షదాయకములైన సప్తపురములలో అవంతిక యొకటి :

"అయోధ్యా మథురా మాయా కాశీ కాంచీ అవంతికా
పురీ ద్వారవతీ చైవ సప్తైతే మోక్షదాయకాః"

స్కందమహాపురాణములోని అవంత్యఖండములో ఈనగర వైశిష్ట్యము వైభవోపేతముగా వర్ణింపఁబడి యున్నది. మహాభారతములోను శివ పురాణములోను ఉజ్జయిని మహిమ కొనియాడఁబడి యున్నది. శిప్రానదిలో స్నానముచేసినవారి సర్వపాపములు పటాపంచలగును. సర్వ దారిద్ర్యములు దూరమైపోవును. మహాతపోనిధి యైన సాందీపని ఆశ్రమమున శ్రీకృష్ణబలరాములు విద్యాభ్యాస మొనర్చిన పవిత్ర స్థల మిది. మహాపరాక్రమోపేతుడైన విక్రమాదిత్యుని రాజధానీనగర మిదియే. ఇచ్చటనే కాళిదాసాది మహాకవులు నవరత్నములై సంస్కృతసాహిత్యాకాశమున జాజ్వల్యమానముగ ప్రకాశించిరి.

పురాణ కథ :

పూర్వము అవంతీనగరమున వేదవిద్యలలో అఖండుడు, నిత్యాగ్నిహోత్రి, నిష్ఠాగరిష్ఠుడైన "వేదప్రియుఁ"డను ఒక ఉత్తమ బ్రాహ్మణుఁ డుండెను. ఆయనకు దేవప్రియుడు ప్రియమేధుడు, సుకృతుడు, సువ్రతుడు అను నలుగురు కుమారు లుండిరి. అతఁడు తనయులతో కలసి శివభక్తితత్పరుఁడై ధర్మనిష్ఠతో కాలము గడుపు చుండెను. పట్టణ సమీపములోని రత్నమాల పర్వతముపైనున్న "దూషణుఁ"డను క్రూర రాక్షసుఁడు వేదప్రియుని కీర్తిప్రతిష్ఠలు విని, సమస్త రాక్షస సైన్యముతో అవంతీపురము మీదికి దాడివెడలి వచ్చెను.

ధర్మద్రోహియైన ఆరాక్షసునిచూచి ప్రజానీక మంతయు భయ భ్రాంతమైనది. ఉజ్జయిని నలుమూలల ఆర్తనాదములు మిన్నుముట్టి నవి. కాని పరమభక్తాగ్రగణ్యుడైన వేదప్రియుడు చలింపలేదు. ఆయన నిశ్చలమనస్సుతో శివదీక్షా నిమగ్నుడై యుండెను. రాక్ష సుడు క్రోధాంధుఁడై వీనిని "నఱుకుఁడు, చంపుఁ" డని హుంక రించి వేదప్రియునిపై దురాక్రమణ మొనర్చెను. భక్తవత్సలుఁడైన పరమశివుఁడు తత్క్షణము మహాకాల రూపముతో సాక్షాత్కరించి, ఒక్క ప్రళయ హుంకారముతో దూషణుని దురహంకారమును భస్మీకరించెను. దుష్టశిక్షణము శిష్టరక్షణ మొనరించిన మహేశ్వరు నభినందించుచు ఆ శుభసమయమునందు దాకాశమున దేవదుందుభులు మొరసినవి; పుష్పవర్షము కురిసినది.

భక్తవత్సలుఁడైన శంకరుడు ప్రసన్నరూపముతో వేదప్రియు నికి ప్రత్యక్షమై వరము కోరుకొనుమనెను. వేదప్రియుడు చేతులు జోడించి స్వామికి నమస్కరించి "దేవదేవా! మహాదేవా! నావంటి దీనులైన భక్తులను అకాలమృత్యువునుండి రక్షించుచు సర్వకాలముల యందు ఇచ్చటనే నెలకొనియుండుము" అని ప్రార్థించెను. 'తథాస్తు'

అని భక్తుని అభీష్టానుసారము ముక్తిప్రదాయకుఁడైన పరమశివుఁడు 'మహాకాళ' నామముతో జ్యోతిర్లింగమై వెలసెను.

ఉజ్జయినీ నగరమును పరిపాలించు చంద్రసేన మహారాజు మహా శివభక్తుడు. ఒకనాఁడతఁడు శివార్చనములో నిమగ్నుడైయున్న సమయమున 'శ్రీకరుఁడు' అను ఐదేళ్ల గోపాలబాలుఁడు తల్లితో పాటు అక్కడ కరుదెంచెను. రాజుగారి దైవభక్తిని చూచి తన్మయుఁడై, తానుకూడ స్వయముగా భగవంతుని పరమశివుని ఆరాధించుకొనవలెనని నిశ్చయించుకొనెను. ఇంటికి వెళ్లుచు శ్రీకరుఁడు వీథిలోని శిలాఖండము నొకదానిని తీసికొని వెళ్లెను. ఆ రాతిబండనే శివలింగముగా భావించెను. పుష్పచందనాదులతో పూజించెను. శ్రీకరుఁడు శివ ధ్యాన నిమగ్నుఁడై యుండెను. చాలసేపు గడచినది. ఇంతలో తల్లి వచ్చి శ్రీకరుని భోజనమునకు రమ్మని పిలిచినది. శ్రీకరుఁడు తల్లి మాటలు వినిపించుకొనలేదు. కన్నులు మూసికొని తన్మయుఁడై ఉండెను. పిలిచి పిలిచి ఆమె విసిగి వేసారిపోయి చివరకు ఆశిలా శకలమును తీసిపాఱవైచినది.

భక్తిప్రపూర్ణుఁడైన శ్రీకరుఁడు తన యిష్టదైవమునైన శంభుని కోసము పెద్దగా ఆక్రందించి అలసిపోయి మూర్ఛనందెను. భక్తజన వశంకరుఁడైన శంకరుఁడు శ్రీకరుని ముందు నిజరూపముతో ప్రత్యక్ష మయ్యెను. శ్రీకరుడు కనులువిప్పి చూచుసరికి ఎదురుగా మహాకాళ మందిరము, అందు దేదీప్యమానముగ విరాజిల్లుచున్న జ్యోతిర్లింగము అతనికి కనిపించినవి. అదిచూచి ఆ బాలుఁడు ఆశ్చర్యపులకితుఁడై మరల మహాదేవుస్తుతింప నారంభించెను. తల్లి వచ్చి ఇదంతయుచూచి ఆనందోల్లాసముతో పొంగిపోయినది. ఈ యద్భుతసంఘటనము నగర మంతయు ప్రాకినది. ఆబాలగోపాల మచ్చటకు వచ్చినది.

చంద్రసేన మహారాజు పరుగు పరుగున నరుగుదెంచి బాలుని భక్తితాత్పర్యముల కచ్చెరువందెను. ఇంతలో శ్రీరామ భక్తాగ్ర

గణ్యుఁడైన హనుమంతుడు వారిముందు ప్రత్యక్షమయ్యెను. "ఓ మానవులారా! ఈ సర్వసృష్టికి ఏకైక శరణ్యము శంకరుఁడు. ఆ మహాదేవుని ఆరాధింపుఁడు. తరింపుడు. మహర్షులు సహస్ర వర్షములు తపము కావించి పొందలేనిఫలము ఈ బాలుఁడు శివపూజావిశేషమున అల్పకాలములో అనాయాసముగ సాధించినాడు. వీని సందర్శనము వలన మీజన్మము ధన్యమైనది. ఈ గోపబాలుని యెనిమిదవ తరమున నందుఁడను మహానుభావుఁడు జన్మించును. శ్రీమన్నారాయణుఁడు నందనందనుఁడై జన్మించి లోకోద్ధరణ మొనర్పఁగలఁడు." అని చెప్పి హనుమంతుఁ డదృశ్యమైపోయెను. శ్రీమహాకాళదేవుని సేవించి వేద ప్రియుడు, శ్రీకరుడు, చంద్రసేన మహారాజు మొదలగువారు పరమ శివ సాన్నిధ్యము చేరుకొనిరి.

శ్లో॥ ఆకాశే తారకం లింగం పాతాలే హాటకేశ్వరమ్
మర్త్యలోకే మహాకాలం లింగత్రయ నమోఽస్తు తే॥

అని పురాణములలో మహాకాళేశ్వరమహిమ యభివర్ణింపఁబడినది.

## ఓంకారే పరమేశ్వరమ్

క్షేత్ర మహిమ :

మాలవప్రాంతములో నర్మదాతీరమున ఓంకార క్షేత్ర మున్నది. ఇక్కడ నర్మదానది రెండుపాయలుగా ప్రవహించును. ఒకపాయ నర్మద; మఱొకటి కావేరిక. ఒకపాయ ఉత్తరముగాను మఱొకపాయ దక్షిణముగాను ప్రవహించుచుండును. రెండింటినడుమ ఒక పెద్దకొండచట్టు ఏర్పడినది, దీనిని "శివపురి" లేదా "మాంధాత పురి" యని పిలుతురు.

మాంధాత సుప్రసిద్ధుడైన సూర్యవంశపురాజు. ఆయన మహా భక్తుఁడు, మహావీరుఁడు, మహాతపస్వి. పుణ్యమూర్తి యగు మాంధాత

చక్రవర్తి ఈ పర్వత శిఖరముపై అనేక వత్సరములు ఘోరతపస్సు చేసి పరమేశ్వరుని ప్రసన్నునిగావించుకొని స్వామికి దేవాలయము నిర్మించెను. అందుచే దీనికి "మాంధాతపురి" యని ప్రఖ్యాతి వచ్చినది.

మాంధాత పర్వతము మీద చాల దేవాలయము లున్నవి. అవన్నియు ప్రణవాకారములో నుండును. ఓంకారేశ్వర దేవాలయము ప్రణవముమీది బాలచంద్రునివలె ప్రకాశించుచుండును. ఓంకారేశ్వరుని సన్నిధికి వెళ్లుమార్గమున 'విష్ణుపురి' 'బ్రహ్మపురి' యని మరి రెండు చిన్నచిన్న కొండగుట్టలున్నవి. ఈ రెండింటిమధ్యగా 'కపిలధార'యను నది ప్రవహించి, నర్మదానదిలో సంగమించును. ఓంకారేశ్వర దర్శనమునకు నర్మదా నదిపై నౌకాయానము చేయవలెను. శివపురాణములో నీ క్షేత్రమహిమ హృద్యముగ నభివర్ణింపబడియున్నది.

పురాణ కథ :

ఒకప్పుడు నారదమునీంద్రుఁడు పరమేశ్వరారాధనకై గోకర్ణ క్షేత్రమునకు వెళ్ళెను. కొంతకాలమునకు నారదమహర్షి తిఁరిగి వచ్చుచు వింధ్యపర్వత సమీపమునకు విచ్చేసెను. వింధ్యుఁడు సాదరముగా నెదురేగి నారదమహర్షికి స్వాగతము పలికి "నేను పర్వతరాజును! సర్వసంపన్నుఁడను. ఏ విషయములోను నాకు లోపము లేదు." అని సగర్వముగ నిలబడెను. అది కనిపెట్టి, నారదుఁడు ఆయన అహంకారమును అణచివేయ సంకల్పించెను. దేవర్షి వింధ్యగిరిని బుజ్జగించి జాలిగా నిట్టూరుపు విడిచెను. అది చూచి వింధ్యుఁడు "ఏమి నారదా! అనన్యమైన నా ఉన్నతిని చూచి మెచ్చుకొనుటకు బదులు పరిహాసముగా నిట్టూరుపు విడుచుచున్నావు?" అని సాభిమానముగ ప్రశ్నించెను.

నారదుఁడు నవ్వుచు "మఱేమున్నది? నీ వెంతవాడవైనను ఆ మేరుపర్వతమునకు లోకువే కదా! అతని శిఖరాగ్రములు దేవలోకముదనుక వ్యాపించినవి." మఱి నీ వెక్కడ! మేరు వెక్కడ!"

అని వెళ్ళిపోయెను. నారదుని మాటలు తలంచుకొని వింధ్యుఁడు చాల బాధపడెను. "సరే! నేను వెంటనే వెళ్ళి సకల జగన్నాథుడైన యుమానాథుని గూర్చి కఠోర తపస్సు కావింతును. ఆ మహాదేవుని ప్రసన్నుని చేసికొందును." అని నిశ్చయించుకొనెను. తత్ క్షణమే ఓంకార క్షేత్రమున ఆరునెలలు అనన్య సామాన్యమగు తపస్సు నాచరించెను. వింధ్యుని తపోదీక్షకు సంతసించి శంకరుఁడు ప్రత్యక్షమై "వత్సా! నీ భక్తికి మెచ్చితిని. వరము కోరుకొను" మనెను. వింధ్యుఁడు స్వామి పాదములమీఁద పడి "దేవా! భక్తవత్సలా! నా జన్మ ధన్యమైనది. నా వాంఛిత మీడేరునట్లు నన్ననుగ్రహింపుము. నా బుద్ధి నిత్యప్రసన్న మగునట్లు వరము ప్రసాదింపుము. నీవు నా శిరస్సుపై నిత్యము సన్నిధిచేసి యుండు"మని యభ్యర్థించెను.

"అట్లే పర్వతరాజా!" అని పరమశివుడు పర్వతాధిపునకు వరమిచ్చెను. ఇంతలో దేవతలు మహర్షులు అచ్చటికి వచ్చి "చేతులు మోడ్చి" జగత్ప్రభూ! పార్వతీ విభూ! మా మొఱలాలకించుము. నీవు జ్యోతిర్మయరూపముతో ఇక్కడే స్థిరముగా నిలిచియుండుము.' అని పరిపరి విధముల ప్రార్థించిరి. భక్తుల అభ్యర్థనము నంగీకరించి లోక కల్యాణార్థమై పరమశివుఁడు ప్రణవాకారములో 'ఓంకారేశ్వరు'డనియు పార్థివాకారములో 'పరమేశ్వరు'డనియు రెండు నామములు ధరించి యచ్చట నావిర్భవించెను.

## కేదారం హిమవత్ పృష్ఠే

క్షేత్రమహిమ :

కేదారనాథ జ్యోతిర్లింగము ద్వాదశ జ్యోతిర్లింగములలో నైదవది. దర్శన మాత్రముననే సమస్త దోషములు పోగొట్టు నీ మహాశివలింగము హిమాలయమునందలి కేదారశిఖరమున విరాజిల్లుచున్నది. కేదారశిఖరమునకు పశ్చిమ దిశయందు 'మందాకిని'యు, తూర్పు

దిక్కున 'అలకనంద'యు ప్రవహించుచుండును. మందాకినీ తీరము నందు కేదారనాథస్వామియు, అలకనందా తీరమున బదరీ నారాయణస్వామియు వెలసియున్నారు. అలకనందా మందాకినీ నదులు 'రుద్రప్రయాగ'లో కలిసికొని కొంతదూరము ప్రవహించి 'దేవ ప్రయాగ దగ్గర 'భాగీరథి'లో సంగమించుచున్నవి. అందుచే గంగా స్నానము చేయు భక్తులు శ్రీ కేదారనాథ బదరీనాథ చరణ కమలోదకములలో మునుగుచున్నట్లే భావింతురు. స్కాందపురాణమునందలి కేదార ఖండమున శ్రీ కేదారేశ్వర జ్యోతిర్లింగ మహిమాతిశయము మనోహరముగ వర్ణింపఁబడినది. ఏ యాత్రికుఁడైనను కేదారనాథుని సందర్శింపకయే బదరీయాత్ర చేసినచో వాని యాత్ర నిష్ఫలమని వాకొనఁబడినది :-

శ్లో॥ అకృత్వా దర్శనం వైశ్య! కేదార స్యాఘనాశినః
యో గచ్ఛేద్ బదరీం తస్య యాత్రా నిష్ఫలతాం వ్రజేత్॥

కేదారేశ్వర సహితముగ నరనారాయణులను సందర్శించిన వారికి సమస్తపాపములు పరాభూతములై జీవన్ముక్తి ప్రాప్తించునని నొక్కి వక్కాణింపఁబడినది.

శ్లో॥ దృష్ట్వా రూపం నరస్యైవ తథా నారాయణస్య చ
కేదారేశ్వర నామ్నశ్చ ముక్తిభాగీ న సంశయః॥

శ్లో॥ కేదారేశస్య భక్తా యే మార్గస్థా స్తస్య వై మృతాః
తేఽపి ముక్తా భవంత్యేవ నాత్ర కార్యా విచారణా॥

స్కాందపురాణము.

కేదారయాత్రకై బయలుదేరిన ప్రాణి మధ్యేమార్గమున మరణించినను వానికి పుణ్యలోకములు కరతలామలకము లని పురాణము లుగ్గడించుచున్నవి. కేదార క్షేత్రము హరిద్వారమునకు 150 మైళ్ళ దూరమున హృషీకేశమునకు 132 మైళ్ళ దూరమున నున్నది.

పురాణకథ :

నరనారాయణులు మహా తపస్సంపన్నులు. వారిరువురు శ్రీమన్నారాయణుని యవతారములు. ఆమహర్షులు బదరికాశ్రమమున పెక్కు సంవత్సరములు తపస్సుచేసిరి. జగత్కల్యాణము నభిలషించి వారు కేదార శిఖరమున పరమశివు నారాధింపసాగిరి.

నరనారాయణులు ప్రతిదినము ప్రభాతమున మందాకినీ తరంగములలో మజ్జనమాచరించి పరమేశ్వరుని పార్థివలింగములను నిర్మించుకొని భక్తిపురస్సరముగ పూజించుచుండిరి. మధురశీతలములైన మందాకినీ జలములతోడను, పరమపవిత్రములైన బిల్వపత్రములతోడను, ప్రఫుల్లములైన పద్మప్రసూనములతోడను, వారు ప్రతి నిత్యము మృత్యుంజయు నత్యంత శ్రద్ధాసక్తులతో నర్చించిరి.

కొంతకాలము గడచినది. పరమేశ్వరునకు నరనారాయణులపై కరుణకల్గినది. స్వామి సాక్షాత్కరించెను. నరనారాయణులు స్వామికి సాష్టాంగ దండప్రణామము లాచరించి పరిపరివిధముల ప్రస్తుతించిరి. పరమశివుఁడు ప్రసన్నుఁడై "వరము కోరుకొం"డనెను నరనారాయణులు చేతులుమోడ్చి "దయామయా! మృత్యుంజయా! జగత్కల్యాణముకొఱకు మేము నిన్నారాధించితిమి. నీవు మమ్మనుగ్రహించితివి. ధన్యులమైతిమి. ఇక ముందుకూడ భక్తజనకల్పకమవై కొలిచిన వారి కోర్కె లీడేర్చుచు నీ కేదారశిఖరమునందే కేదారేశ్వర నామముతో నుండుము. నీమూర్తిని దర్శించి, పూజించి,స్తుతించి భక్తులు తరింతురు. ఇదియే మా వాంఛిత"మని ప్రార్థించిరి. పరమేశ్వరుఁడు నరనారాయణుల ప్రార్థన మన్నించి కేదారనాథ జ్యోతిర్లింగరూపమున నందు వెలుగొందుచుండెను.

కేదారేశ్వరలింగమును కృతయుగమున నరనారాయణులును, త్రేతాయుగమున నుపమన్యుమహర్షియు, ద్వాపరమున పంచపాండవు

లను పూజించి ధన్యులైరి. కేదారనాథదేవాలయమున పంచపాండవుల శిలా విగ్రహము లిప్పుడును దర్శనీయములు.

## డాకిన్యాం భీమ శంకరమ్

క్షేత్ర మహిమ :

సహ్యాపర్వత శిఖరములలో నొకదాని పేరు 'డాకిని'. ఆ శిఖరాగ్రమున పరమేశ్వరుఁడు భీమశంకర జ్యోతిర్లింగరూపముతో లోకానుగ్రహార్థ మవతరించియున్నాఁడు. భీమానది యిచ్చటనే జన్మించినది. ఉద్గమస్థానమున శివలింగము ప్రక్కనుండి జలము కొంచెము కొంచెముగా ప్రవహించుచుండును. సకలజన శుభంకరుఁడు భీమశంకరుఁడై శాకినీ డాకినీ రక్షస్సమూహములు పరివేష్టించి సేవించుచుండ నిచ్చట సన్నిధిచేసియున్నాఁడు.

పురాణ కథ :

పూర్వము భీముఁ డను మహాబలవంతుఁడైన రాక్షసుఁ డుండెను. వాఁడు సర్వజన భయంకరుఁడై జననియగు కర్కటితో సహ్యపర్వత శిఖరములపై నివసించుచుండెను. ఒకనాఁడు వాఁడు తన తల్లిని గాంచి 'అమ్మా! నా తండ్రి యెవ్వఁడు? ఎక్కడ నున్నాఁడు? నీవీ కొండపై నొంటరిగా నుండుటకు హేతువేమి?" యని ప్రశ్నించెను. కర్కటి కుమారునితో నిట్లు చెప్పెను. "పుత్త్రకా! లంకాధినాథుఁడైన రావణుని తమ్ముఁడు కుంభకర్ణుఁడు మీ తండ్రి. మహా పరాక్రమోపేతులైన మీ తండ్రిని పెదతండ్రిని దుర్మార్గుఁడైన శ్రీరాముఁడు సంహరించెను. మా తండ్రి కర్కటుఁడు; తల్లి పుష్కసి. విరాధుఁడు నా ప్రథమభర్త. వానిని కూడ పూర్వమున శ్రీరాముఁడే హతమార్చెను. ఒకనాఁడు నా తలిదండ్రులు అగస్త్యమహర్షి శిష్యుఁడైన సుతీక్ష్ణుని పట్టుకొని భక్షింపఁబోయిరి. మహాతపస్వియగు వాఁడు క్రుద్ధుఁడై నా జననీ జనకులను భస్మము చేసినాఁడు. నేను దిక్కు

మాలిపదానవై ఒక్క తెనే బిక్కు బిక్కు మని కాలము గడపుచుంటిని. అట్టియెడ జగజెట్టి రావణుని తమ్ముడు కుంభకర్ణుడిచ్చటికి వచ్చి నన్ను బలాత్కారముగ చేపట్టినాడు. తత్ఫలముగ నీవు పుట్టితివి. నీ తండ్రి మహావీరుడు. తండ్రిని మించిన కొడుకవై వంశమునకు పేరు తెమ్ము."

తల్లి పలుకులు విని భీముడు కుపితుడైనాడు. తన వంశమును ధ్వంస మొనర్చిన విష్ణుమూర్తిని ఆయన భక్తులను సర్వనాశనము చేయవలెనని సంకల్పించినాడు. దేవతలను మహర్షులను మట్టుపెట్ట వలెనని పట్టుపట్టినాడు. బ్రహ్మదేవునిగురించి వెయ్యి సంవత్సరాలు ఏకదీక్షతో తపస్సుచేసినాడు. పద్మసంభవుడు ప్రత్యక్షమై రాక్షసరాజునకు నిరుపమానపరాక్రమము నిరవధికధైర్యము వరము లుగా ప్రసాదించి యదృశ్యుడైనాడు.

వరగర్వితుడైన భీమాసురుడు సురలోకముపై దండెత్తి దేవేంద్రుని పదభ్రష్టుని గావించినాడు. దేవతలను పరాభూతుల నొనర్చి దేవలోకము నాక్రమించుకొనినాడు. స్వర్గవిజయానంతరము భూలోకమున జైత్రయాత్ర సాగించి సాధువు లగు భక్తులను బాధించి నాడు. పూజ్యులగు మహర్షులను వేధించినాడు.

ఆకాలములో సుదక్షిణు డను మహారాజు కామరూపదేశము నేలుచుండెను. ఆయన పరమ శివ భక్తాగ్రగణ్యుడు. అఖండ తప స్సంపన్నుడు. భీముడు కామరూపాధిపతిపై దండెత్తి యోడించి ధర్మాత్ముడైన యా ధరణీనాథుని కారాగారబద్ధుని గావించెను. శివపూజా ధురంధరుడైన సుదక్షిణుడు నిర్బంధములోనే నిరం తరము పరమశివుని పార్థివలింగస్వరూపుని పూజించుచు పంచాక్షరీ మంత్రమును భక్తిపూర్వకముగ జపించుచుండెను.

ఒకదినము భీముడు సుదక్షిణుని సమీపించి "ఓరీ! రాజా ధమా! ఈ జపములేమి! ఈ తపములేమి! ఈ శివపూజలేమి!" అని

గర్జించెను. సుదక్షిణుడు నిశ్చలముగా నిర్భయముగా శివపూజ చేసి కొనుచుండెను. రాక్షసుని కోపము పెరిగెను. వాడు పండ్లు పట పట కొరుకుచు ఒరనుండి కరవాలము తీసి "ఓరీ మూర్ఖా! ఏమిటీ మౌనము? మాటాడవేమి" అని యరచెను. సుదక్షిణుడు ప్రసన్నముగా కన్నులు తెరచి "రాక్షసరాజా! ఈ చరాచర సృష్టి కంతటి కిని ప్రభువు పరమశివుడు. ఆ పరమేశ్వరుడే సమస్తమునకు కర్తయు, భర్తయు, హర్తయునై యున్నాడు. నేనా జగదీశ్వరు నారాధించుచున్నాను. నీ గర్జనలు, గాండ్రింపులు నన్నేమియు చేయజాలవు"అని పలికెను.

ఆ పలుకులు విని భీముడు మహోగ్రుడై యట్టహాసము చేసెను. చేతనున్న చంద్రహాసమును ఝుళిపించుచు "వీడా నీ శివుడు! నీ రక్షకుడు. ఇదిగో కాచుకొనుము. వీని నిప్పుడే నా కరవాలముతో ఖండ ఖండములు గావించుచుంటి" నని శివలింగముపై శస్త్రము విసరెను. తక్షణమే శివలింగమునుండి ఫాలాక్షుడు సాక్షాత్కరించి రూక్షవీక్షణములతో నా రాక్షసుని భస్మముగావించెను.

సుదక్షిణుడు భక్తిపారవశ్యముతో పార్వతీపతి పాదములపై బడి నమస్కరించెను. ఆనంద బాష్పములతో స్వామి చరణముల నభిషేకించెను. పరిపరి విధముల ప్రస్తుతించెను.

పరమశివుని కరుణాకటాక్షము వలన దుష్టరాక్షస సంహారము జరిగినది. లోకముల పీడ వదలినది. ఇంద్రాది దేవతలు తమ తమ స్థానము లలంకరించిరి. మహర్షుల జపతపములు నిర్విఘ్నము లయ్యెను. సకల లోకములకు శాంతి భద్రతలు సమకూరెను. సుదక్షిణుడు ప్రాప్తరాజ్యుడై యథాపూర్వముగ ప్రజాపాలన మొనర్చెను. ఇంద్రాది దేవతలు నారదాది మహర్షులు సుదక్షిణాది భక్తపుంగవులు పరమశివుని ప్రస్తుతించి జ్యోతిర్లింగ రూపములో నిక్కడే యుండుమని ప్రార్థించిరి. పరమేశ్వరుడు వారి ప్రార్థన మన్నించెను.

శ్లో॥ ఇత్యేవం ప్రార్థిత శ్శంభు ర్లోకానాం హితకారకః
తత్రైవ స్థితవాన్ ప్రీత్యా స్వతంత్రో భక్తవత్సలః॥

భీమాసుర విజయ చిహ్నముగ భీమశంకర జ్యోతిర్లింగ స్వరూపమును ధరించి భక్తవత్సలుఁడైన బాలచంద్రశేఖరుఁడు డాకినీ శిఖరాగ్రము నందు ప్రకాశించుచుండెను.

## వారాణస్యాం తు విశ్వేశమ్

క్షేత్రమహిమ :

సకలసౌభాగ్యరాశి యైన కాశియందు విశ్వేశ్వర జ్యోతిర్లింగము విరాజమానమై యున్నది. కాశీ క్షేత్రమునకు "వారణాసి, వారాణసి, అవిముక్తము, ఆనందకాననము, మహాశ్మశానము, రుద్రావాసము, కాశిక, తపఃస్థలి, ముక్తిభూమి, క్షేత్రపురి, శివపురి, త్రిపురారి రాజనగరి" యను నామములు ప్రసిద్ధములు. 'వరణ' 'అసి' అను నదీద్వయ మిరుపంకలఁ బ్రవహించుటచే వారణాసీ యను నామము కాశీ క్షేత్రమున కన్వర్థమగుచున్నది.

మోక్షదాయకము లగు సప్తక్షేత్రములలో కాశి ఖ్యాతి గాంచినది. వేదపురాణములలో కాశీమహిమ వివిధరీతుల నభివర్ణితమైనది. "ఆప ఇవ కాశినా సంగృహీతాః" (ఋగ్వేదము) మఘవన్ కాశిరిత్తే (ఋగ్వేదము) యజ్ఞః కాశీనాం భరతః సాత్వతామివ (శతపథబ్రాహ్మణము) "సా కాశీ త్రిపురారి రాజనగరీ పాయాదపాయా జ్జగత్" (కాశీఖండము)

ప్రళయకాలమున పరమేశ్వరుఁడు తన త్రిశూలాగ్రమున నీ నగరము నుద్ధరించి ధరించు నని యభిజ్ఞ వచనము. కాశీక్షేత్రమున మరణించిన వారికి ముక్తి కరతలామలక మని "కాశ్యాం తు మరణాన్ముక్తిః" అను సూక్తి వ్యక్తీకరించుచున్నది. ఇచ్చట మరణించు ప్రతిజీవికి విశ్వనాథుఁడు దక్షిణకర్ణమున తారకమంత్రోపదేశ మొనర్చునని పురాణ ప్రమాణము.

శ్లో॥ కదా కాశీం గమిష్యామి కదా ద్రక్ష్యామి శంకరమ్
ఇతి బ్రువాణ స్సతతం కాశీ వాసఫలం లభేత్॥

"ఎప్పుడు కాశికి వెళ్ళుదును! ఎప్పుడు విశ్వనాథుని సందర్శింతును!" అని యెల్లప్పుడు పలుకుచున్నమాత్రముననే కాశీనివాసమహాఫలము మానవునకు సంప్రాప్తించును.

తే॥ గీ॥ కాశి కల్యాణముల కాది కారణంబు
కాశి యణిమాదిసిద్ధుల కాటపట్టు
కాశి జనలోక సంకల్ప కల్పవల్లి
కలుష పిశితంబు మెసవు రాకాసి కాశి.

అని కవిసార్వభౌములు కాశిని కొనియాడినారు. "కలి ప్రవేశింప దానందకాననమున" "శ్రీనివాసంబు వారణాసీ పురంబు, "ముక్తి సంధాయకం బవిముక్తకంబు" అని కాశీనగరము కవుల కైవారము లందుకొన్నది. "వేద పురాణ శాస్త్ర పదవీ నదవీయసి యైన పెద్ద ముత్తైదువ" అన్నపూర్ణాభవాని ఆకొన్నవారికి అమృతపాయసాన్నములు వారణాసీనగరమున వడ్డించునట! కాశీక్షేత్రమున నసంఖ్యాకములగు పుణ్యతీర్థము లున్నవి. వానిలో

శ్లో॥ విశ్వేశం మాధవం ఢుంఢిం దండపాణిం చ భైరవమ్॥
వందే కాశీం గుహం గంగాం భవానీం మణికర్ణికామ్॥

శ్రీ విశ్వనాథ జ్యోతిర్లింగము, బిందుమాధవుఁడు, కాలభైరవుఁడు, కుమారస్వామి, గంగ, అన్నపూర్ణాభవాని, మణికర్ణిక విశేష సందర్శనీయములు - సమారాధనీయములు.

పురాణ కథ :

సచ్చిదానందస్వరూపుఁ డైన పరమశివుఁడు ప్రపంచమును సృష్టింప సంకల్పించెను. ఆ పరబ్రహ్మము సగుణరూపములో శివ

స్వరూపుడై యావిర్భవించెను. స్త్రీపురుష రూపములలో ప్రకటితమైన యాయాదిమ పరబ్రహ్మమే శక్తిగా శివుడుగా రూపొందెను. ఆ శివశక్తులు ప్రకృతిపురుషులను సృష్టించిరి. ఆ ప్రకృతిపురుషులు తమ జననీజనకులను తెలిసికొనలేక విచారించుచుండిరి. ఆ సమయమున నిర్గుణపరబ్రహ్మ మగు పరమశివుడు "మీ రిరువురు తపస్సు చేయుడు. బ్రహ్మాండమును సృష్టింపుడు" అని పలికెను.

ప్రకృతిపురుషులు "ప్రభూ! తపస్సు చేయుటకు స్థానమెక్కడ?" అని ప్రశ్నించిరి. పరమశివుడు పంచక్రోశ పరిమితమైన యొక సుందరనగరమును నిర్మించి వారి కిచ్చెను. ఆ మహానగరము ఆ పురుషుని సమీపమున ఆకాశమునందు నిలిచెను. ఆ పురుషుడు శ్రీమహావిష్ణువు. ఆ నగరమే కాశీక్షేత్రము. విష్ణుదేవుడు ఆనగరమునందుండి మహాసృష్టికి సంకల్పించి పరమశివుని గూర్చి పెక్కు సంవత్సరములు తపస్సు చేసెను. ఆ సమయమున తపశ్చర్యచే నలసిపోయిన శ్రీమహావిష్ణువు శరీరమునందుండి యసంఖ్యాకములగు శ్వేతజలధారలు ప్రవహించి సువిశాల గగనాంగణమున వ్యాపించెను. ఆ విచిత్రదృశ్యమును చూచి శ్రీమహావిష్ణువు చకితుడై శిరశ్చాలనముచేసెను. అప్పుడా శ్రీహరి దక్షిణకర్ణమునుండి మణిభూషణము జాఱిపడెను. ఆ కర్ణమణి పడిన స్థానము "మణికర్ణిక" యను మహాతీర్థ మయ్యెను. ఆ మహాజలరాశిలో మునిగిపోవుచున్న పంచక్రోశి కాశిని పరమశివుడు తన త్రిశూలాగ్రమున ధరించెను. మహావిష్ణువు తన పత్ని యగు ప్రకృతితో నచ్చోట నిద్రించెను. ఆయన నాభినుండి చతుర్ముఖబ్రహ్మ యావిర్భవించెను. చతుర్ముఖుడు శివాజ్ఞను పొంది బ్రహ్మాండమును సృష్టించెను. మహావిష్ణువు పరమశివు నీ క్రిందివిధముగా స్తోత్రముచేసెను.

శ్లో॥ స్రష్టా త్వం సర్వజగతాం రక్షితా సర్వదేహినామ్
హర్తా చ సర్వభూతానాం త్వాం వినైవాస్తి కోఽపరః॥

అణూనామణ్వణీయాంస్త్వం మహాంస్త్వం మహతా మపి
అంతర్బహి స్త్వమేవైతజ్జగ దాక్రమ్య వర్తసే॥

నిగమా స్తవ నిశ్వాసా విశ్వం తే శిల్పవైభవమ్
స్వర్గస్త్వ మపవర్గస్త్వం త్వమోంకార స్త్వమధ్వరః॥

త్వం యోగ స్త్వం పరా సంవిత్ కిం త్వం న భవసీశ్వర।
త్వమాదిర్మధ్య మంతశ్చ త్వష్టుషాం జగ్మషా మపి॥

ఓ పరమేశ్వరా! సమస్తజగత్తులకు నీవు సృష్టికర్తవు. సర్వప్రాణులకు నీవే సంరక్షకుఁడవు! సర్వభూతములు నీయందే లయించుచున్నవి. సర్వమును నీవే. నీకంటె మరెవ్వరు లేరు. "అణోః రణీయాన్ మహతో మహీయాన్" అను శ్రుతికి నీవే యేకైకలక్ష్యమవు. లోపల వెలుపల నాక్రమించి సమస్తబ్రహ్మాండమున వర్తించుచున్నావు. వేదములు నీ యుచ్ఛ్వాసనిశ్వాసములు. ఈ విశాల విశ్వమంతయు నీ సుందరశిల్పరచనము. నీవే స్వర్గము. నీవే అపవర్గము. నీవు ప్రణవ స్వరూపుఁడవు. నీవు యజ్ఞమూర్తివి. నీవే యోగము. నీవే సచ్చిదానందమయపరబ్రహ్మము. నీవు కాని దేదియు సృష్టిలో లేనే లేదు. చరాచర మహా ప్రపంచమునకు "ఆది మధ్యాంతములు" నీవే.

శ్రీమన్నారాయణుని స్తుతివాక్యములకు పరమశివుఁడు సంతుష్టుఁడయ్యెను. బ్రహ్మ విష్ణ్వాది దేవతా ప్రార్థితుఁడైన పరమేశ్వరుఁడు విశ్వేశ్వరజ్యోతిర్లింగమై వారణాసి యందు విరాజిల్లెను.

## త్ర్యంబకం గౌతమీ తటే

క్షేత్ర మహిమ :

జగత్ప్రసిద్ధమైన త్ర్యంబకేశ్వరజ్యోతిర్లింగము నాసికమండలమున సహ్యగిరి శిఖరాగ్రమున వెలసియున్నది. తత్పరిసరమునందే

పంచవటి యున్నది. ఈ స్థానముననే లక్ష్మణుడు శూర్పణఖ నాసికా కర్ణములను గోసినాడట. సీతాపహరణ మిచ్చోటనే జరిగినది. ఇచ్చటికి కొలదిదూరమున బ్రహ్మగిరిపై గోదావరి ప్రభవించినది.

ఉత్తరభారతములో గంగానదివలె దక్షిణభారతములో గోదావరీ ప్రవంతి 'పాపవిమోచని'గా ప్రసిద్ధిగాంచినది. భగీరథుని తపః ఫలముగా భాగీరథి యవతరించినట్లే గౌతముని త్యాగఫలముగా గౌతమి యావిర్భవించినది. గౌతమ మహాముని చేఁ గొనిరాబడుటచే గోదావరికి గౌతమీ సమాఖ్య సంపన్నమైనది.

గోదావరీ గౌతమమునీంద్రుల ప్రార్థన మన్నించి భక్తవత్సలుఁడైన పరమశివుఁడు త్ర్యంబకేశ్వర రూపములో నిచ్చట విచ్చేసి యున్నాఁడు. త్ర్యంబకేశ్వర దేవాలయములో మూఁడు చిన్న చిన్న లింగాకృతు లున్నవి. వీనిని బ్రహ్మ విష్ణు మహేశ్వరాత్మకములుగ భక్తులు భావింతురు. త్ర్యంబకేశ్వర సందర్శనసంపూజనముల వలన నైహికాముష్మిక ఫలములు ప్రాప్తించునని ప్రాజ్ఞవచనము. బ్రహ్మగిరిపైనున్న 'రామకుండము' 'లక్ష్మణకుండము' దర్శనీయములు. దురితపరిహారకములు. బ్రహ్మగిరిపైకి నెక్కుటకు సుమారేడువందల సోపానము లున్నవి. పైకెక్కిన వెంటనే గోముఖ సమద్గత గోదావరి కన్నులపండువుగ కనిపించును.

పురాణకథ :

గౌతముఁడు మహాతపస్వి. ఆ మహర్షి ధర్మపత్ని యహల్యాదేవి. మహాసాధ్వియైన యహల్యతో గౌతమమహర్షి బ్రహ్మగిరి శిఖరాగ్రమున శంకరునిగూర్చి సహస్ర సంవత్సరములు కఠోరతపము గావించెను. ఆ మహామాహేశ్వరుఁడు మహేశ్వరానుగ్రహమునకుఁ బాత్రుఁడయ్యెను.

ఒకానొక సమయమున ననావృష్టికారణముగ దేశము నలుమూలల క్షామదేవత ప్రళయతాండవ మొనర్చెను. త్రాగుటకు నీరు,

తినుటకు తిండిలేక ప్రజలలో హాహాకారములు చెలరేగెను. పశువులకు పచ్చగడ్డి కఱవయ్యెను. చెట్టుచేమలు మలమల మాడిపోయెను. నేల బీటలు వారెను. సెగలు పొగలు గ్రక్కెను. సకల సృష్టి సంక్షుబ్ధమయ్యెను. ప్రపంచము పాడుపడినట్లయ్యెను.

దేశమునందలి దైన్యమును గౌతముఁడు సహింపలేకపోయెను. ఆ కరుణామయుఁడు వరుణదేవునిగూర్చి యాఱుమాసము లఖండ తపము గావించెను. వరుణదేవుడు ప్రసన్నుఁడై "మహర్షి ! నీ తపః కారణము గ్రహించితిని. నీవొక చిన్న సరస్సును నిర్మింపుము. నేను దానిని సలిల సంపూర్ణము చేయుదును. అందలి జలము లక్షయమలై యెన్నటికిని తఱుఁగవు." అని పలికి యంతర్హితుఁ డయ్యెను.

గౌతముఁడు సరస్సు నిర్మించెను. వరుణదేవుని యనుగ్రహముచే నది యక్షయ జల పరిపూర్ణమయ్యెను. గౌతముఁ డాసరోజలములతో నిత్య నైమిత్తిక కృత్యముల నిర్వర్తించుకొనుచుండెను. జపహోమ తపః పూజాదికములు యథాపూర్వముగ సాగించుచుండెను. సరోవర జలములచే పరిసరములందలి తరులతాదులు చివురించెను. భూమి సస్య శ్యామల మయ్యెను. పశుపక్ష్యాదులకు బ్రదుకు లభించెను. ఆ సరస్సు చుట్టు ప్రక్కల నొక చక్కని తపోవనము తయారయ్యెను.

ఆ వనములో మరల నవజీవనము ప్రారంభమయ్యెను. గౌతమ మహర్షి తపః ప్రభావమువలన నాయాశ్రమమున నెల్లయెడల నవోల్లాసము వెల్లివిరిసెను.

ఎక్కడెక్కడి ఋషులు నక్కడికే వచ్చి చేరిరి. మునిజన మంతయు గౌతమాశ్రమము చుట్టు కాపురము పెట్టిరి. పర్ణశాలలు నిర్మించుకొనిరి. నిర్విచారముగా నిత్యకృత్యములు జపతపములు నిర్వర్తించుకొనుచుండిరి. ఇట్లుండగా నొకనాడు ఋషిపత్నులు గౌతమ పత్నియగు నహల్యాదేవితో నకారణముగ వివాదమునకు దిగిరి. కలహశీలలగు మునియిల్లాండ్రు లేనిపోని సాకులు కల్పించి యామె

ననేక విధముల కాడిపోసికొనిరి. గౌతముపై తమ భర్తల పురికొల్పిరి. విశ్వాస శూన్యులైన యీ ఋషులు కటువు కాటకములచే మలమల మాడు తమకు నాశ్రయ మిచ్చి యాదుకొనిన గౌతమ మహర్షిపై కయ్యమునకు కాలుద్రవ్విరి. ఆలోచనారహితులై హానితలపెట్టిరి. ప్రసన్న హృదయుఁడు పరమశాంతస్వభావుఁడగు గౌతమమహర్షి ఋషుల రోషపూర్ణ భాషణములను దూషణములను సహించెను. గౌతముని సహనము ఋషులకు మఱింత రోషహేతు వయ్యెను.

దుష్టులైన ఋషులు గౌతము నవమానింప కృతనిశ్చయు లయిరి. కుట్రలు సాగించిరి. ఒక ముసలి గోవును గౌతముని పంటపొలము లోనికి తోలిరి. ఆవు పంటపొలము పాడుచేయుట చూచి గౌతము, డొక గడ్డి పఱకతో దానిని తోలెను. ఆ శుష్కతృణము గోవును స్పృశించెనో లేదో అది గిరగిర తిఱిగి ధరణిపై నొరిగి మరణించినది. ఇదంతయు ఋషుల పన్నాగమని గౌతముఁ డెఱుఁగ లేడయ్యెను.

సమయము చిక్కినది. ఋషు లందఱు పరుగుపరుగున వచ్చిరి. గోహత్య గావించితివని గౌతమమహర్షిని నానావిధముల నిందించిరి. దురాత్ముడ వని దూషించిరి. దురహంకారి వని పరుషవాక్కులు భాషించిరి. వెనువెంటనే ఈ వనము విడిచిపోవలసిన దని శాసించిరి. ధర్మమూర్తియైన గౌతముడు చేయునదిలేక సతీ ద్వితీయుడై యాశ్రమము విడిచి యల్లంతదూరమున నొక కుటీరమును నిర్మించుకొనెను. దురహంకారులైన మునులు గౌతముని పర్ణకుటీరము కడ కరిగి "నీ శిరమున గోహత్యాపాతకము తాండవించుచున్నది. నీ ముఖము చూచిన పంచమహాపాపములు ప్రాప్తించును. నీ దర్శనము సర్వానర్థ హేతువు. నీ సామీప్యముచే మే మర్పించు హవ్యకవ్యములు దేవతలు పితృదేవతలు గ్రహించుట లేదు. ఇకనిక్కడ నుండుటకు నీ కర్హత లేదు. నీ పాపమునకు ప్రాయశ్చిత్తము చేసికొను"మని గద్దించిరి. గౌతముఁడు "మిత్రులారా! నా పాపమునకు ప్రాయశ్చిత్తముకూడ మీరే సెలవిం"డని పలికెను. ఋషులు గౌతముని

చూచి "నీవు మూడుపర్యాయములు భూప్రదక్షిణము చేసి రావలెను. ఒక నెల నిరాహారుఁడవై తపోదీక్ష సాగింపవలెను. ఈ బ్రహ్మగిరి చుట్టు నూటొక్క పర్యాయములు తిరిగిరావలెను. ఇక్కడకు గంగను కొనిరావలెను. తజ్జలములలో మజ్జనమొనర్చి కోటి శివలింగములను పూజింపవలెను, తరువాత వందబిందెల జలముతో నిందుశేఖరు నభిషేకింపవలెను. అప్పటికిగాని నీ గోహత్యామహాపాతకము తొలగి పోదు." అని కఠోరముగ వాక్రుచ్చిరి.

గౌతముఁడు ఋషుల యాదేశమును శిరసావహించెను. వారు చెప్పిన కార్యములన్నియు కొనసాగించెను. పత్నీసహితుఁడై బ్రహ్మగిరిపై చేరి పార్థివలింగాకారములో నున్న పరమశివుని భక్తిపూర్వకముగా పూజించెను. పరమేశ్వరుఁడు గౌతముని ధర్మాసక్తికి, దైవభక్తికి, సహనశక్తికి సంతోషించెను. ప్రమథగణ పరివృతుఁడై పార్వతీపతి ప్రత్యక్షమయ్యెను. గౌతముఁడు గంగాధరునకు కరములు మోడ్చి నమస్కరించెను. మహాదేవుఁడు మహర్షితో "నీ భక్తికి మెచ్చితిని. నీ వాంఛిత మీడేర్ప వచ్చితిని. వరము కోరుకొనుము" అని పలికెను. గౌతముడు పరమానందభరితుఁడై "ప్రభూ! నీ సందర్శనముచే నా జన్మము చరితార్థమైనది. నన్ననుగ్రహించితివి. ఇంక నాకేమి కావలెను" అని పరమశివుని పాదములు పట్టుకొని ప్రార్థించెను. శివుఁడు "నాయనా! నీవు ధన్యుఁడవు. మునిజన మూర్ధన్యుడవు. సకల లోకమాన్యుడవు. దురహంకారులైన నీతోడి ఋషులు నీ యభ్యుదయము సహింపలేక నిన్ననేకవిధముల హింసించిరి. వారి యజ్ఞానమును క్షమింపు" మని పలికెను. గౌతముఁడు ప్రాంజలియై "స్వామీ! వారు నాకు మహోపకారమే చేసిరి. అట్లుకానిచో జగత్కల్యాణకరమైన స్వామి సందర్శనము నాకు కాదుగదా?" అనెను.

గౌతముని శాంతభావమునకు మహేశ్వరుఁడు మరింత సంతోషించెను. కరుణాకటాక్షవీక్షణములతో "గౌతమా! ఇదిగో నీ కాంక్షితము ననుసరించి గంగను ప్రసాదించుచున్నాను. ఈ గంగ

గౌతమీ నామము ధరించి నీ కీర్తి ప్రవాహమువలె ప్రవహించుగాక. త్ర్యంబకేశ్వరజ్యోతిర్లింగరూపములో నే నీ గౌతమీతీరమున నిలిచి నీ వంటి భక్తుల ననుగ్రహించుచుందును" అని అంతర్ధానమయ్యెను.

ఋషులు గౌతముని పాదములపైబడి తమ్ము క్షమింపు మని ప్రార్థించిరి. సర్వదేవతలు సంతోషించిరి. నాటినుండి గంగ గౌతమీ నామముతో భూతలమును ప్రఫుల్ల మొనర్చుచు ప్రవహించెను. సాంబశివుఁడు త్ర్యంబకేశ్వరరూపముతో తత్తీరమున విరాజిల్లెను.

## వైద్యనాథం చితాభూమౌ

### క్షేత్ర మహిమ :

సురాసుర సమారాధిత చరణద్వయుఁడైన మృత్యుంజయుఁడు వైద్యనాథ జ్యోతిర్లింగ రూపములో ఉత్తరభారతమునందు "చితాభూమి" అను ప్రదేశములో సుప్రతిష్ఠితుఁడై యున్నాడు. సందర్శన మాత్రముననే సర్వపాపములను హరించివేయుచు, శరణాగతులకు భక్తి ముక్తులను ప్రసాదించుచు స్వామి విరాజిల్లుచున్నాడు. సమస్త శారీరక మానసిక వ్యాధులను పరిమార్చు ప్రభువగుటవలన స్వామికి "వైద్యనాథు" డను సార్థక నామధేయము వచ్చినది.

### పురాణకథ :

ఒకప్పుడు రాక్షసాధీశ్వరుఁడైన రావణాసురుఁడు కైలాసపర్వతము మీఁద గౌరీవల్లభు నారాధించెను. ఎంతకాలమునకు పరమశివుఁడు ప్రసన్నుఁడు కాలేదు. పట్టినపట్టువీడక రావణుఁడు పంచాగ్ని మధ్యమునఁ గూర్చుండి భయంకర తపోదీక్ష నవలంబించెను. ఇట్లు లంకేశ్వరుఁడు గ్రీష్మకాలమున భగభగమండు జ్వాలనజ్వాలా మధ్యమున కూర్చుండియు, వర్షకాలమున జడివానలో నిలబడియు శీతకాలమున కంఠ దఘ్న జలములలో నిలుచుండియు ఘోర తపస్సు చేసెను. కాని పరమేశ్వరుఁడు ప్రత్యక్షము కాలేదు. మహా

మనస్వియైన దశకంధరుడు దృఢదీక్షా ధురంధరుడై కరాళ ఖడ్గముతో నొక్కొక్క శిరమును ఖండించి యుమారమణునకు సమర్పింపసాగెను. క్రమముగా రావణుని తొమ్మిది శిరములు పరమేశ్వరునకు పూజాపుష్పములైనవి. ఒక్కటియే తల మిగిలియున్నది స్వామి సాక్షాత్కరింపలేదు. లంకేశ్వరుడు సంకోచింపక తన పదియవ శిరస్సును ఖండించుటకై ఖడ్గమునెత్తెను. భక్తవత్సలుడైన పార్వతీపతి రాక్షసేశ్వరునిముందు సాక్షాత్కరించి, వరము కోరుకొమ్మనెను. పరమేశ్వరానుగ్రహమున పౌలస్త్యునకు పది తలలు ప్రాప్తించెను.

రావణుడు నతమస్తకుడై హస్తములు జోడించి "పరమేశ్వరా! నిన్ను నావెంట లంకానగరమునకుఁ గొనిపోయి స్వేచ్ఛగా ఆరాధించుకొందును. ఈ నా మనోరథము నీడేర్చి నన్ను కటాక్షింపుము" అని అభ్యర్థించెను. పరమశివుడు పౌలస్త్యుని భక్తికి మెచ్చి "రాక్షసరాజా! ఈ శివలింగమును నాకు మారుగా ఇచ్చుచున్నాను. ఇది మహా మహిమాన్వితము. సకల ఫలప్రదము. దీనిని లంకకుఁ గొనిపోయి పూజించుకొనుము. ఒక్కమాట. మధ్యేమార్గమున దీనిని భూమిపై నుంచకుము. ఉంచితివా, అక్కడే సుస్థిర సుప్రతిష్ఠితమగును." అని శివలింగము నొసఁగి సదాశివుఁ డదృశ్యుఁ డయ్యెను.

రావణుడు సంతుష్టాంతరంగుడై శివలింగమును గైకొని లంకకు ప్రయాణమైనాడు. మార్గమధ్యములో 'చితాభూమి' అను ప్రదేశమునకు వచ్చునప్పటికి లఘుశంక కేగవలసివచ్చినది. ఆత్రోవ వెంట వెళ్ళుచున్న గోపాలబాలుని పిలిచి, శివలింగము నతనిచేతికిచ్చి రావణుడు వెడలెను.

ఒక్క ముహూర్తమాత్రము గోపాలబాలుడు శివలింగము నెట్లెట్లులో పట్టుకొన గలిగెను. తర్వాత దాని భారమును భరించలేక అతడు లింగమును భూమిమీఁద పెట్టెను. రావణుఁ డవసరము తీర్చుకొని వచ్చునప్పటికి శివలింగము భూమిలో పాదుకొని పోయినది.

అఖండబలసమన్వితుడైన యసురేంద్రుడు దానిని పెకల్చుటను విశ్వ ప్రయత్నము చేసెను. భూమి యంతయు కదలినదే కాని శివలింగము మాత్రము లవలేశము లేవలేదు. చేయునది లేక రాక్షసరాజు తన రత్నాంగుళీయకమును శివలింగము శిరస్సుపై నుంచి లంకకు వెళ్లి పోయెను. సుప్రతిష్ఠితుడైన స్వామిపై పుష్పవృష్టి కురిసెను. బ్రహ్మ విష్ణు దేవేంద్రాదులు వచ్చి భక్తితో పరమశివు నర్చించిరి. అప్పటి నుండి స్వామి 'వైద్య నాథ' నామముతో చితాభూమియందు విరాజిల్లుచుండెను.

## నాగేశం దారుకావనే

క్షేత్ర మహిమ :

నాగేశ్వర జ్యోతిర్లింగము దారుకావనములో గోమతీ ద్వారక సమీపమున వెలసియున్నది. స్వామిని దర్శించి సేవించిన వారికి శాశ్వతమైన పుణ్యలోకములు సంప్రాప్తించును. స్వామి యావిర్భావ కథను వినిన మాత్రముననే సకలపాతకములు శమించును. సర్వార్థములు సమకూరును.

శ్లో॥ ఏతద్ యః శృణుయాన్నిత్యం నాగేశోద్భవ మాదరాత్
సర్వాన్ కామానియాద్ ధీమాన్ మహాపాతక నాశనాత్
(శివ పురాణము)

పురాణకథ :

పూర్వము దారుక అను నొక రాక్షసి యుండెను. ఆమె భర్త దారుకుడు. ఆ దానవదంపతులు మానవులను హింసించుచుండిరి. మహర్షుల యాశ్రమములలోc జొచ్చి, వారి యజ్ఞయాగాదులను విధ్వంస మొనర్చుచుండిరి. పశ్చిమసముద్రతీరమున దారుకుడు వెయ్యి యోజనముల పొడవును అంతియ వెడల్పుగల ఒక పెద్దవనమును నిర్మించుకొని ఆవనములో భార్యతోcగూడి విలాసముగా విహరించు

చుండెను. అమాయికు లగు సాధువుల ననేక విధముల పీడింపసాగెను. వాని పీడ పడలేక వారందరు ఔర్వమహర్షి సన్నిధికేగి తమపాట్లు విన్నవించుకొనిరి. శరణాగతులైన వారిని రక్షింపనెంచి ఔర్వ మహర్షి "నిరపరాధులైన భూమిమీఁది ప్రజలను హింసించినచో రాక్షసులు తత్క్షణమే మరణించెదరని ఘోరముగా శపించెను. ఈ విషయ మెఱిఁగి దారుకుఁడు వరబలమున వనమునంతటిని పైకెత్తి సముద్రమధ్యములో స్థాపన మొనర్చెను ఔర్వమహర్షి శాపములో 'భూమిమీఁది ప్రజ' అనుటచే దారుకుఁడు సముద్రమధ్యములో వన స్థాపన మొనర్చి, సముద్రచారులను సంహరించుచు నిర్భయముగా నిర్విచారముగా కాలము గడుపుచుండెను.

ఒక పర్యాయము పశ్చిమ సముద్రములో అనేక నావలు ప్రయాణించుచుండెను. వానిలో నెందఱో ప్రజ లుండిరి. ఇదిచూచి దారుకుఁడు వారిపై దాడిచేసెను. వారి నందఱను నిర్బంధించి కారాగారములో బంధించెను. వారిలో "సుప్రియుఁడు" అను నుత్తమ వైశ్యుఁ డొకఁడుండెను. సుప్రియుఁడు ధర్మాత్ముఁడు; సదా చార సంపన్నుఁడు; విభూతి రుద్రాక్ష ధారియై అనన్యభక్తితో పరమ శివుని ఆరాధించు భక్తాగ్రగణ్యుఁడు. కారాగారముననున్నను సుప్రియుఁడు శివార్చనము మానలేదు. "నమశ్శివాయ" యను పంచాక్షరీమంత్రమును తా నొక్కఁడే జపించుచుండుటగాక, తన వారి కందఱకు నుపదేశించి వారిని శివభక్తులుగా నొనర్చెను.

ఇది చూచి రాక్షసు లందఱు సుప్రియునిమీఁద కారాలు మిరి యాలు నూరుట ప్రారంభించిరి. దారుకుఁడు శివభక్తితత్పరుఁడైన సుప్రియుని ముందు నిలిచి "ఓరీ! మానవాధమా! ఏమిటీ దొంగ వేషాలు? అసలు నీ వెవరియాజ్ఞతో ఈ పూజాపురస్కారములు కొన సాగించుచున్నావు?" అని గర్జించెను. దారుకుని తర్జనభర్జనలకు సుప్రియుఁడు చలింపలేదు. అతఁడు నిమీలితనేత్రుఁడై నిష్కారిష్ఠుఁడై నిశ్చలచిత్తముతో శివపూజ కావించుచుండెను. దారుకుఁడు కోపో

ద్రేకముతో ఈ తుంటరిని వెంటనే కొనిపోయి చిత్రవధ చేయుడని సేవకుల కాజ్ఞాపించెను. రక్కసు లొక్క పెట్టున నట్టహాసములొనర్చి సుప్రియుని పై లంఘించిరి.

సుప్రియుఁడు నిటల ఘటితాంజలిపుటుఁడై నిటలాక్షు నిట్లు ప్రార్థించెను. "శంకరా! సాధుజనవశంకరా! ఈ దాసుని రక్షించుము. కల్యాణమూర్తి! త్రిలోకనాథా! భవానీమనోహరా! భక్తవత్సలా! పరమశివా! ఈ దుష్టులను శిక్షించుము. నా దుఃఖమును దూరము గావించుము."

పరమేశ్వరుఁడు భక్తుని ప్రార్థనము నాలకించెను. క్షణములో నచ్చట నొక మహామందిరము విరాజిల్లినది. మందిర మధ్యభాగమున జ్యోతిర్లింగము దివ్యదీప్తితో తేజరిల్లినది! వెనువెంటనే సుప్రియుడు ఆ శివలింగము నాలింగనము చేసికొనెను. పర్వత రాజపుత్రితో పరమశివుఁడు ప్రత్యక్షమయ్యెను. తనచేతిలోని పాశుపతాస్త్రముతో దారుకాది దానవాధిపతులను హతమార్చెను. అనంతరము ఆ వన మెల్ల భక్తులకు నివాస యోగ్యమగునట్లు వరము ప్రసాదించి అదృశ్యమయ్యెను. అదియే దారుకావనము. అందలి జ్యోతిర్లింగమే నాగనాథ నామముతో నలరారెను.

## సేతు బంధేచ రామేశమ్

క్షేత్ర మహిమ:

శ్రీ రామేశ్వర జ్యోతిర్లింగము దక్షిణ సముద్రతీరమున ధనుష్కోటి సమీపమున విరాజిల్లుచున్నది. రామేశ్వర మహాక్షేత్రము భారత భూమియందలి పుణ్యక్షేత్రములలో నగ్రగణ్యము. ఈ క్షేత్ర మహిమ స్కాందపురాణములో నీ క్రింది విధముగ వర్ణితమైనది.

శ్లో॥ అస్తిరామేశ్వరం నామ రామసేతౌ ప్రతిష్ఠితమ్
క్షేత్రాణామపి సర్వేషాం తీర్థానామపిచోత్తమమ్॥

సేతుం రామేశ్వరం లింగం గంధమాదన పర్వతమ్
చింతయన్ మనుజ స్సత్యం సర్వపాపైః ప్రముచ్యతే॥

రామేశ్వర శివలింగము ద్వాదశజ్యోతిర్లింగములలో పదునొకండవది. ఈ శివలింగము సీతామనోహరుఁడైన శ్రీరామచంద్రుని కరకమలములచే సుప్రతిష్ఠితమైనది. రామేశ్వర స్వామి దేవాలయము వెయ్యియడుగుల పొడవును, ఆఱువందల యేబది యడుగుల వెడల్పును, నూటయేబది యడుగుల యెత్తును గలిగి యనల్పశిల్ప కళాలక్ష్మీ కాలవాలమై యలరారును. ఇందలి నందీశ్వరుఁడు, రజత రథము, స్వర్ణ గోపురములు దర్శనీయములు. రామతీర్థము, సేతుమాధవ తీర్థము, అమృతవాటిక, హనుమత్కుండము మొదలగునవి సమస్త దోష హరములు. గంగాజలములతో రామేశ్వరములో శివలింగము నభిషేకించినవారు జీవన్ముక్తులగుదురని పురాణ ప్రమాణము.

పురాణకథ;

శ్రీరాముఁడు రావణ సంహారానంతరము సీతంగూడి సపరివారముగ పుష్పక విమానారూఢుఁడై సముద్రముదాటి గంధమాదన పర్వతమునకు విచ్చేసెను. అచ్చట మునీశ్వరులు శ్రీరామచంద్రుని సందర్శించిరి. పులస్త్యబ్రహ్మ పుత్రుఁడగు రావణుని సంహరించుట వలన సంభవించిన బ్రహ్మహత్యా పాప మెట్లు పరిహారమగునని శ్రీరాముఁడు వారిని ప్రశ్నించెను. "ఈ ప్రదేశమున శివలింగమును ప్రతిష్ఠించి పూజింపుము. సమస్త దోషము శమించు"నని మునులు పలికిరి.

శ్రీరామచంద్రుఁడు శివలింగమును గొనిరమ్మని హనుమంతుని కైలాసమున కంపెను. వాయునందనుఁడు వచ్చుట రవంత విలంబమైనది. సుముహూర్తము సమీపించినది. మహర్షుల యాజ్ఞానుసారము సీతాదేవి చేతులతో నచ్చటి యిసుకప్రోవుచేసి శివలింగమును సిద్ధముచేసినది. శ్రీరాముఁడు యథావిధిగ ప్రతిష్ఠాపన మొనర్చినాఁడు.

ఇంతలో వాయుపుత్రుడు వచ్చి వ్రాలినాడు. జరిగిన విష యము తెలిసికొని సంక్షోభించినాడు. శ్రీరాముని పాదములపైబడి వెక్కి వెక్కి యేడ్చినాడు. భక్తవత్సలుడైన ప్రభువు పవనతనయు ననునయించి తొందరపడుటకుగల కారణము చెప్పినాడు.

సమీరకుమారుడు స్వామి పలుకులకు సంతుష్టుడు కాలేదు. శ్రీరాముడు చిఱునవ్వునవ్వుచు "అట్లయిన హనుమా! సుముహూర్త మతిక్రమించుననిగదా ప్రతిష్ఠ జరిపితిమి. నీకిష్టములేనిచో నా శివ లింగము తీసివేయుము. నీవు తెచ్చిన లింగమునే యచ్చట ప్రతిష్ఠింతము." అన్నాడు. హనుమంతుడు సంతోషముతో ఎగిరిగంతు వేసినాడు. ముందుకుదూకినాడు. చేతులతో బట్టి శివలింగమును పెకలింప బూనినాడు.

శివలింగము కదలలేదు. పవనపుత్రుడు బలమంతయు నుపయోగించినాడు. స్వామి చలింపలేదు. తన సుదీర్ఘవాలము నా వాలుకా లింగముచుట్టుజుట్టి యంజనానందనుడు బలవంతముగ నొక్క గుంజు గుంజినాడు. లవమాత్రము లాభములేకపోగా అయూపున కల్లంత దూరమున నెగిరిపడి మారుతి మూర్ఛిల్లినాడు. సీత భీతిల్లి శ్రీరాముని బతిమాలినది. శ్రీరాముడు శీతల హస్తస్పర్శచే మూర్ఛ వాపి మారుతిని జేరదీసి యొడిలో గూర్చుండబెట్టుకొన్నాడు. కన్నీరుతుడిచి బుజ్జగించినాడు. "నాయనా! శాస్త్రోక్తముగా స్వామిని ప్రతిష్ఠించితిమి. ప్రపంచములోని యే శక్తియు నిప్పుడీ శివలింగమును కదలింపలేదు." అని యోదార్చి అతడు కొనివచ్చిన శివలింగము నాసమీపముననే శాస్త్రోక్తముగ ప్రతిష్ఠచేయించి హనుమంతుని సంతుష్టాంతరంగునిగావించినాడు. రామునిచే ప్రతిష్ఠితమైన శివలింగము రామేశ్వర నామమునను, హనుమంతుడు గొనివచ్చిన శివలింగము హనుమదీశ్వర నామమునను ప్రసిద్ధములై పూజలందుకొనుచున్నవి.

శ్లో॥ స్వయం హరేణ దత్తంతు హనుమన్నామకం శివమ్
సంపశ్యన్ రామనాథంచ కృతకృత్యోభవేన్నరః॥

# ఘుశ్మేశం చ శివాలయే

క్షేత్ర మహిమ :

దక్షిణ భారతమున ఘుశ్మేశ్వర జ్యోతిర్లింగము సువిరాజమానమై యున్నది. దీనికి సమీపము నందే ప్రపంచ ప్రసిద్ధిగాంచిన ఎల్లోరా గుహ లున్నవి. ఇందలి కైలాసమందిర సౌందర్యము నయనానంద సందాయకము. అనల్పశిల్ప సంశోభితము. ఘుశ్మేశ్వరుని సేవించిన వారికి పునర్జన్మము లేదు. సకల సౌభాగ్యములు సంప్రాప్తించును.

పురాణ కథ :

దక్షిణ భారత ప్రాంతములో అత్యంత శోభావంతమైన దేవ గిరి దుర్గము విరాజిల్లుచున్నది. తదుపాంతముననే "సుధర్ముఁ"డను బ్రాహ్మణుఁడు నివసించుచుండెను. ఆయన ధర్మపత్ని సుదేహ.

జ్యోతిశ్శాస్త్రవేత్తలు సుదేహ జన్మ లగ్నాదికములు పరిశీలించి ఆమెకు సంతాన ప్రాప్తి లేదని వక్కాణించిరి. సుతులఁలేని వారికి గతులు లేవని పండితులు సెలవిచ్చిరి. సుదేహ భర్తను సమీపించి "నాథా! మీరు నా సోదరియైన ఘుశ్మను వివాహమాడుఁడు. ఆమె మూలముననైన సంతానము కలిగిన అదియే మనకు పదివేలు!" అన్నది. ఎట్టకేలకు అంగీకరించి, సుధర్ముఁడు ఒక శుభముహూర్తమున ఘుశ్మను పరిణయమాడెను.

ఘుశ్మ మహాపతివ్రత. పరమేశ్వర భక్తురాలు. పతిసేవతో పాటు అక్కగారికికూడ సేవచేయుచుండెను. ఆ సాధ్వీపూజలు ఫలించినవి. ఆమె జీవితము ధన్యమైనది. శివుఁడు అనుగ్రహించెను. ఘుశ్మ గర్భవతి యయ్యెను. ఒక శుభలగ్నమున సమస్త శుభలక్షణ సంపన్నుఁడైన ఒక పుత్త్రుఁడు జన్మించెను. ఆనాడు వారి ఆనం దమునకు అవధులు లేవు. చంద్రునిగాంచిన సముద్రునివలె సుధ ర్మని హృదయము పుత్త్రసందర్శనముచే పొంగిపోయినది.

కొంతకాలము గడచినది. సుదేహ మనస్సులో అసూయాంకు రము తలయెత్తినది. ఆమెలో అనురాగము అంతరించినది. ద్వేషము రగుల్కొనినది. రాక్షసప్రవృత్తి ప్రకోపించినది. ఇల్లంతయు ఘుశ్మదే! ఈ వైభవమంతయు ఘుశ్మదే! ఇచ్చట తానెవరు? తనదేమున్నది?

సుదేహ కరమున చురకత్తి తళతళ మెరిసినది. ఆ కరాళ కాళ రాత్రిలో నిద్రాసక్తుడైఉన్న కుమారుని దేహము రక్తసిక్తమైనది. సుతుని మృతకళేబరము నా పాపాత్మురాలు ప్రక్కనున్న సరోవర ములో పాఱవైచినది!

తెల్లవాఱినది. ఘుశ్మ పూజాగృహములో శివపూజాతత్పరయై యున్నది. సుదేహ పరుగెత్తుకొనివచ్చి "అబ్బాయిని ఎక్కడకు పంపితివి?" అని అడిగినది. పరమేశ్వర పారవశ్యములో మైమఱచి యున్న ఘుశ్మకు ఆమె పలుకులు వినపడలేదు.

ఘుశ్మ పూజ పూర్తిచేసి, పార్థివశివలింగములను సమీపమున నున్న సరోవరములో కలుపుటకై వెళ్ళినది. ఆమె కుమారుఁడు సరోవరజలములలోనుండి ఈదుకొని వచ్చుచుండెను. అతడు తల్లితో "అమ్మా! నేను చనిపోయి పునర్జన్మ ఎత్తినట్లు కలగంటిని" అని పలికెను. ఘుశ్మ ఆశ్చర్యచకితురాలై చూచుచుండ నందనుఁ డానందముతో వచ్చి కన్నతల్లిని కౌగిలించుకొనెను. ఇందుశేఖరుఁడు వారిముందు సాక్షాత్కరించి "ఘుశ్మా! నీవు ధన్యురాలవు. కటిక రాకాసియై నీకుమారుని చిత్రవధచేసిన మహాపాపాత్మురాలు సుదేహ! ఇప్పుడే ఈ పుత్త్రఘాతుకిని శిక్షింతు"ననెను. ఘుశ్మ సాంబశివుని సన్నిధిలో చేతులు జోడించి "స్వామీ! ఈమెను క్షమించు ఈమె అమాయికురాలు" అని ప్రార్థించెను.

సుధాంశుశేఖరుఁడు సుప్రసన్నుఁడైనాడు. "నీ ఔదార్యము నకు మెచ్చితిని. నీ వాంఛితము సఫలమగుగాక! ఇకనుండి నీపేరు మీఁదుగా ఘుశ్మేశ్వరనామముతో నేనిచ్చట వెలసియుందును"

అని పలికి గౌరీకాంతుఁ డంతర్ధానమయ్యెను. నాటినుండి ఘుశ్మే శ్వరుడు జ్యోతిర్లింగరూపములో భూజనులపూజలందుకొనుచున్నాడు. ఘుశ్మేశ్వర శివలింగ సందర్శనముచే సమస్తపాపములు పరాస్తము లగును. శుక్లపక్షమున చంద్రరేఖవలె వారి సుఖమయజీవితము దిన దినాభ్యుదయము నందును.

ఈశాన స్సర్వవిద్యానా మీశ్వర స్సర్వభూతానాం బ్రహ్మాధి
పతిర్ బ్రహ్మణోఽధిపతిర్ బ్రహ్మ శివో మేఽస్తు సదాశివోమ్॥

ఇవి ద్వాదశజ్యోతిర్లింగములు. ఏవంవిధమైనది జ్యోతిర్లింగ వైభవము. ఈ శివమహాక్షేత్రములను శంకరాచార్యులవారు సంద ర్శించి సమర్చించి సంస్తుతించిరి. ఆస్తోత్రశ్లోకములు సతాత్పర్యముగ నిందుఁ బొందుపఱచితిమి. కవుల యనువాదపద్యములు చేర్చితిమి. ఆయాపుణ్యక్షేత్రముల చిత్రములు సమకూర్చితిమి. ఏతన్మహాగ్రంథ ప్రకాశమునకు హేతుభూతులయినవారు వదాన్యశిరోమణులు వైది కాచారపరాయణులు శ్రీమనికొండ కాశీవిశ్వనాథము గారు. ఇది వారికి క్రొత్తగాదు. ఇంతకుమును "భగవద్గీత", "కల్యాణకల్ప వల్లి", "శ్రీగణేశపంచరత్నమాల", "సప్తరామాయణము" మొదలగు సద్గ్రంథములఁ బ్రకటించిరి. పెక్కు ధర్మకార్యములు నిర్వహించిరి. చతుర్వేదముల పారాయణముచేయించి వేదమూర్తు లను గౌరవించిరి. అష్టాదశ మహాపురాణముల నిచ్చి పౌరాణికులను సత్కరించిరి. భారతదేశములో సమస్తపుణ్యక్షేత్రములను బహు పర్యాయములు సేవించిరి. సద్గుణసంపన్నులైన శ్రీకాశీవిశ్వనాథము గారు పరమేశ్వరకరుణాకటాక్షపాత్రు లగుదురుగాక! శ్రీ విశ్వ నాథము గారు పుత్రపౌత్రపారంపర్యముగ నితోధిక శ్రేయస్సులంది శతాధికగ్రంథరాజములను వెలువరించి యాస్తికమహాజనుల యాశీ స్సుల నందుకొందురుగాక ! ఇతి శివమ్.

జంధ్యాల పాపయ్యశాస్త్రి "కరుణశ్రీ"



మహాదేవుని అభిషేకించుచున్న
మనికొండవారు



"దర్శనాచార్య" "అభినవానంద"

శ్రీ జమ్మలమడక మాధవరామశర్మ

# శ్రీ శివదర్శనము

"అభినవానంద" "లాక్షణికశిరోమణి"

శ్రీ జమ్ములమడక మాధవరామ శర్మ.

"శ్రీశివుడు నాకు పరశివుడు. శివుడు నాకు విశ్వమయుడు విశ్వోత్తీర్ణుడు. శివుడు అష్టమూర్తి. పృథివీజలాగ్నివాయువిహాయసములు సూర్యచంద్రయాజమానులు శివరూపములు. ఇవి శివరూపములనుట శివుడింకను గలడనుట. శివుడు సర్వరూపుడనుట సర్వాతిశాయి యనుట యగును. శివుడు శివదేవుడు. అతడు మహాదేవుడు. హరదేవుడు. దేవదేవుడు. శివు నెన్ని విధములనయిన నందును. కాని శివు ననినట్లె యగుట లేదు. శివునెట్లందును? శివు డెట్లందును? ఇంత కాలముగా నెందరో మహాభావు లేమేమో యనిరి. వారేమియు ననినట్లె కాలేదు. వారొకటి యనిరి. వీరొకటి యనిరి. వారనినది వీరనినది శివుననినదియె కాని శివుననినదియ కాలేదు. అందరొకటి శివునందురె యనుకొందము. కాని శివుననిరని నేనను. నేను శివు నందును. కాని యనలేను. శివుడన ? ? ?......"

ఇట్లుగా శివభావన మొనరించుట యశివజీవుల శివభావనము. అశివజీవుడు శివజీవుడై శివదర్శన మొనరించునో? శ్రీమదభినవగుప్తులిట్లనిరి.

"ఈశస్వభావ ఆత్మా ప్రకాశతే తావత్, తత్ర చాస్య
స్వాతంత్ర్యమితి, న కేనచిద్వపుషా న ప్రకాశతే, తత్ర
అప్రకాశాత్మనాపి ప్రకాశతే ప్రకాశాత్మనాపి"

ఆత్మ శివు డట్లు ప్రకాశించును. అది శివస్వాతంత్ర్యమనుట. శివప్రకాశమెల్లెని యుండును. జడస్వభావమున ప్రకాశించును.

ప్రకాశాత్మగా ప్రకాశించును. ఇట్లని యెట్లు పలుకగలము ? పరమార్థద్వాదశికలో నిది యభినవవాణి.

"యద్వైతత్త్వపరిహారపూర్వకం తత్త్వమేషి తదతత్త్వమేవ హి
యద్వైతత్త్వమథతత్త్వమేవవాతత్త్వమేవననుతత్త్వమీదృశం॥"

అతత్త్వమని యొకటి విడిచి తత్త్వమని యొకటి గ్రహింతువేని యది యతత్త్వమే అగును. అతత్త్వము కాని తత్త్వము కాని యది తత్త్వమే. తత్త్వమిట్లే యుండును. శ్వేతరశ్రుతి శివదర్శనమిచ్చిన "శివోఽహం" భావింతుము. శ్రుతిలో నట్లు భావించిన నశ్రుతిలో నట్లే భావించుట కలుగునో ? అభినవగుప్తు డేమనెను ? మహోప దేశముగా నిట్లనెను.

త్వం త్వమేవాహమేవాహం త్వమేవాసి న చాస్మ్యహం
అహం త్వమిత్యుభౌ న స్తః యత్ర తస్మై నమోనమః॥
అన్తర్దేహే మయా నిత్యం త్వమాత్మా చ గవేషితః
న దృష్టస్త్వం న చైవాత్మా యచ్చ దృష్టం త్వమేవ తత్॥
భవద్భక్తస్య సంజాతభవద్రూపస్య మేఽధునా
త్వామాత్మరూపం సంప్రేక్ష్య తుభ్యం మహ్యం నమోనమః॥

శివా! నీవు నీవె. నేను నేనె. నీవు నీవు కావు. నేను నేను కాను. నీవు నేను అన్న రెండు లేవు. అట్టి నీకు "నమోనమః." నిత్య మంతర్దేహమున నీవాత్మయని వెదకితిని. నీవు కన్పడలేదు. ఆత్మయు గోచరము కాలేదు. ఏమి గోచరించెనో అది నీవె. నీ భక్తుడనై నీరూపము పొందిన నేను నిన్నాత్మగ గుర్తించితిని. నీకు నాకు "నమోనమః". నే నీవిధముగ ననుకొంటిని.

శ్రీశివాయ శివారాధ్య స్వరూపాయ నమోనమః
నమః స్వస్పందభవ్యస్వా త్మనే రస్యరసాత్మనే.

"ఈ విశ్వమంతయు శక్తిపరిస్పందము. ఆ శక్తి శివాదేవి. శ్రీశివుడు శివారాధ్యుడు. విశ్వమంతయు శివస్వభావము. శివుడు శివస్వభావారాధ్యుడు. నా యాత్మ రసాత్మ. ఆ రసము రస్యరసము. అది స్వస్పందసుందరమయిన భవ్యభావము. అట్టి నా శివాత్మకు నమస్కారము". ఇట్లంటిని కాని నే నేమనినట్లయినది! శివుడనిర్వచనీయుడనినట్లయినది. అట్లనుట శివదర్శనమా! శివదర్శనము గహనము. అందు ప్రగాఢతత్త్వవిచారము కలదు. గర్హితకాపాలిక రీతినీతులుం కలవు. వీని సాంగత్యమెట్లు? శివోపాసనము చేయువారు శవోపాసనము చేయుదురు. శవోపాసకులు శక్తికలవారై శివోపాసకులగుదురు. శివుడు సౌమ్యస్వభావుడు. భయావహుడును. ఆతడు శుభంకరుడు. విధ్వంసకుడును. ఆతడు జీవనదాయి. ఆతడు జీవనహారి. శివుడు లింగాకృతి. ఆతడు చతుర్భుజాకృతి. వైదికులు యాగమొనరింతురు. యాగమునకై త్రివ్రి యిష్టికలు కూర్చుదురు. ఇంక నగ్ని వేయురు. కాని "రుద్రోవా ఏష యదగ్నిః". ఆ రుద్రాగ్ని శాంతికై అర్కపత్రమునందుంచిన అజాక్షీరము హోమము చేయుదురు. అపుడు రుద్రాధ్యాయ మంత్రములు కావలెను. వానిలో శివుడున్నాడు. శివుడు రుద్రదేవుడు. రుద్రులేకాదశరుద్రులే యగుదురు. కాని రుద్రులనంతరుద్రులు. అటునిటు సర్వదిక్కములుగా రుద్రులున్నారు. ఈరుద్రవిశేషములు దేశముననున్నవి. దేశాంతరముననున్నవి. ద్వీపాంతరములందున్నవి. విశ్వమంతట శివభక్తులుకలరు. శివోపాసకులు కలరు. శివభజనమొనరించువారు కలరు. ఇవిలేనివారు లేరు. శివునకు శాక్తసంబంధము స్వరూపవ్యాఖ్యానము. పంచాయతనవిద్యయునట్టిది. శివపారమ్యము భావించు "ఏకాయనులు" శివతత్త్వము చెప్పిరి. శివాగమగ్రంథములు అందుకై వెలసినవి. శాక్తామోదమంతయు శివవిభూతి. కేవలశాక్తము భావించుటయు కేవలశైవము సంభావించుటయు శివామోదవిశేషమే. శక్తిసంభిన్నమయిన శివదర్శనము శాంభవదర్శనమై వెలసినది. ఆణవాదిమలములను క్షాలనముచేసికొనిన

వారికి "శివదృష్టి" పట్టగలదు. వారలకప్పుడు శాక్తసమావేశము శాంభవసమావేశము శివానుగ్రహముగా లభించును.

శివకుమారుడు స్కందస్వామి. లోకములోని చోరులందరు స్కందపుత్రులట! ఒక మహాచోరుడు కన్నము వేయుచు "నమః కనక శక్తయే" అని స్తుతి చేసినాడు. శాస్త్రీయముగా చౌర్య మొనరించువారు శివు నర్చింతురేల? కాళిదాసు మేఘకావ్యమున కుమార సంభవమున ఉపాసించి శివతత్త్వము చెప్పుట కుద్యమించెను. సాధకుడు దుఃఖలేపము లేని సుఖము సంపాదించుట కుద్యమించును. శంకరు డగును. అట్లు కాదలచువానికి కామశక్తుల కూర్ధ్వప్రసార మావశ్యకము. అప్పుడాతడు బిందుమయదేహుడై లింగభావుడై భవదేవుని గుర్తింపగలడు. కామదహనానంతరము శివుడు కామినీప్రేమ కలవాడయ్యెను. ఇది యెట్టి ప్రేమ? అది దివ్యప్రేమ. ఊర్ధ్వ రేతస్కుడయినవానికి జ్ఞాననేత్ర ముత్ఫుల్ల మగును. అది శివసాధకుని మూడవకన్ను. శివుని మూడవనేత్రము పార్వతిపై ప్రసరించినపుడు ప్రసన్నముగనే యున్నది. కామునిపై ప్రసరించి దాహకమైనది. మానవుని మూడవకన్ను ప్రసాదామృత మనుభవించును.

శివదేవుడు లింగాకృతియై శివమందిరములందు గోచరించుచున్నాడు. లింగాకృతులనేకములున్నవి. లవణలింగము, ఘృతలింగము, వస్త్రలింగము ఇట్లే మృణ్మయ - దారు - శైల - ముక్తా - లోహ - సువర్ణ - రసలింగములు కలవు. పిండికాలింగములు కలవు. ఇంక ననేకములు కలవు. ఇట్టివన్నియు శివోపాసకుల ఉపాసనా విశేషములు. శివదేవాయతనములందు శివనామవిభావితులు నానా నామసంకేతములుంతురు. ఇట్టివన్నియు వారివారి యారాధనారీతులు. ఇట్లే పాశుపతశాంతి రుద్రశాంతి మొదలగు శాంతిప్రక్రియలును శివారాధనమున కుపకరించు నవి బహుళముగా నున్నవి.

- శివుని పరతత్త్వముగ భావింతుము. వాఙ్మనసాతీతమైనందున పరతత్త్వముపాసించుట అందరకు సులకము కాదు. అతడవ్యయు

పురుషుడని సాధకులు భావించిరి. అవ్యయపురుషుని కయిదుకళలం కలవు. ఆనందము విజ్ఞానము మనము ప్రాణము వాక్కు అనునవి యా కళలు. ఈ యయిదుకళల కధిష్ఠానముగ శివునిరూపము లయిదు కలవు. వానివాని ధ్యానములు వేరు వేరుగ నున్నవి. ఆనందమయ రూపుని మృత్యుంజయనామమున నుపాసింతురు. విజ్ఞానమయుని దక్షిణామూర్తి యందురు. సూర్యమండలము విజ్ఞానఘనరూపము. సవితయే సర్వప్రాణులకు విజ్ఞానదాత. మృత్యుంజయుడు దక్షిణామూర్తి ప్రకాశప్రధానులగుట శ్వేతవర్ణమున నుందురు. మనోమయ కళకు కామేశ్వరుడధిష్ఠానము. కామము మనోధర్మము. కామరాగ మరుణవర్ణము. కామేశ్వరు డరుణమూర్తియని ప్రాణమయమూర్తి పశుపతియని నీలలోహితుడని యుపాసింతురు. నీలలోహితుడు పంచముఖమూర్తి. ఇందొక ముఖ మూర్ధ్వముఖము. మిగులు నాల్గు ముఖములు నలుదిక్కుల నుండును. ఈశాన, తత్పురుష, అఘోర, వామదేవ సద్యోజాత వ్యవహారము పరిచితమే. వాఙ్మయకళకు భూతేశుడధిష్ఠానము. ఇట్లు గూఢప్రగాఢములయిన శివభావనము లున్నవి.

శంకర భగవత్పాదు డద్వైతబ్రహ్మవాది. శివభావుడు. భగవత్పాదుడు తన సమసమయపరిసరములందున్న శైవభావములనుచూచి వివేచన మొనరింప దలచెను. శివస్తుతు లొనరించెను. వివేక సమావేశమున బ్రహ్మాద్వైత ప్రతిష్ఠ యొనర్చెను. జైన బౌద్ధ తంత్ర ప్రభృతి సంప్రదాయ భావ సంకీర్ణమయిన యానాటి శైవము శంకర సంభావ్య శైవము కాలేదు. శంకరుడు శైవుడయిన యద్వైతి. కేవల శైవులు అసంకీర్ణ శైవము తెలియుట కప్రతిభులైరి. శాంకర వివేచనము కాదనలేక పోయిరి. శంకర భగవత్పాదు డద్వైతము ప్రతిష్ఠించెను.

శాంకర వేదాంతములోని మాయారహస్యమును శాంకర వేదాంతపధిక సాధకుడు నవగతము చేసికొనలేడు. మాయ యెచటి

నుండి వచ్చినది? అది చైతన్యము నెట్లా వరించినది? ఆయావరణ మెట్టిది? జిజ్ఞాసువుల కిట్టి ప్రశ్నలుదయించును. "మాయ యనాది. అది యనాది కాలమునుండి బ్రహ్మ నావరించినది. జీవుడనాది. ఈశ్వరు డనాది." ఇట్లు సమాధానములు చెప్పుకొనినను సంతుష్టి కలుగుటలేదు. అద్వైతుల 'బ్రహ్మ' చైతన్య రూపము. ఆనంద రూపము. సాంఖ్య పురుషుడు చైతన్య స్వరూపుడు. కాని యీ చైతన్యమున ఆనందమున నేమి లాభము? కర్తృత్వము లేకున్న నాకర్షణ మేది? బ్రహ్మ సర్వశక్తి. అయిన నాశక్తివలన గలుగున దేమి? బ్రహ్మ కర్తృత్వము కలది కాదు. కర్తృత్వము జగమునం దున్నది." అని యన్నను జిజ్ఞాస నివృత్తమగుటలేదు. కావున మాయను బ్రహ్మను దెలిసికొనుట కింక నుద్యమింపవలయును. ఇట్లుద్య మింపగా సర్వము చిన్మయ మగును. ఈ చిన్మయ జగములో భేదము లేదు. సర్వము పరశివరూపము. పరశివుడు 'చిత్' ఆ చిత్తునుండి చిన్మ యము సర్వ మావిర్భవించును. చిత్తునందు లయించును. ఇది శివ దర్శనము. ఇది ప్రత్యభిజ్ఞాభూమి. ఇది మాహేశ్వర దర్శనము. ఇది యీశ్వరాద్వయ వాదము. ఇది యభినవదర్శనము.

ఈ శివదర్శనమునందును అజ్ఞానము కలదు. మాయకలదు. కాని యది స్వతంత్రము కాదు. పరతత్త్వాధీనము. శివలీలా విలాస మున నీ యజ్ఞానముదయించును. అజ్ఞానముదయించినను పరమ శివ పరమతత్త్వ స్వరూపమున నెట్టి పరివర్తనమును గలుగదు. మాయా విలాసము సృష్టి సర్వముపరమశివలీల. శివుడాప్తకాముడు. శివుడాత్మారాముడు. శివునకేయిచ్ఛయులేదు. ఈ జగల్లీల శివుని క్రీడా మాత్రము.

శాంకర దర్శనమున; మాయ యెవని యధీనమునను లేదు. దాని యందు కర్తృత్వమున్నది. బ్రహ్మ శుద్ధము సాక్షిఅధిష్ఠాన రూపము చైతన్య స్వరూపము. అకర్త. శివదర్శనమున మాయశివాధీనము. పరమ శివుడు స్వతంత్రుడు. చిన్మయుడు. జ్ఞానస్వరూపుడు. కర్మస్వరూపుడు

శైవదర్శనము నందలి విమర్శయు శివస్వభావము. జ్ఞానక్రియలు శివునకేక రూపములై. జ్ఞానక్రియేస్మృఖ్యమున కిచ్ఛయని పేరు. శివుడిచ్ఛామయుడు ఇచ్ఛాజ్ఞానక్రియలను మూడుశక్తులుకల శివుడు స్వాతంత్ర్యమయుడు. ఇంకను శివదర్శనమిట్లు చెప్పును. శివస్వభావముననె సృష్టి, స్థితి సంహారానుగ్రహ విలయములు కలుగును. శాంకరదర్శనమునని ట్టి ప్రసంగము లేదు. బ్రహ్మాద్వైత వాదమునకు శివాద్వయ వాదమున కిట్టి భేదమున్నది. బ్రహ్మాద్వైతమున ఆత్మ సత్తే అయినను అసత్సమానమని మహేశ్వరానందులు సంవిదుల్లాసమున నందురు. రెండిటికి నిత్య సామరస్య మద్వైతమని శివ దర్శనమనును. శాంకరమున నిట్లుకాదు. అందు బ్రహ్మసత్తు. మాయసత్తుకాదు. సత్తునకు కసత్తునకు సామరస్యమెట్లు కలుగును? విమర్శశక్తివలె మాయ బ్రహ్మశక్తి కాదుకదా! "బ్రహ్మసత్యం జగన్మిథ్య" యనుట యద్వైతమా? అది ద్వైతమో? ద్వైతాభాసమో?

శివదర్శనమున వలయు విశిష్టత యున్నది. శివుడె పరతత్త్వము శివునందు తత్త్వములన్నియు నభివ్యక్తములగును. జీవునందలి శివతత్త్వ మాత్మతత్త్వమే. ఆత్మ చైతన్య రూపము. "చైతన్యమాత్మా" పరాసంవిత్ పరమేశ్వర శివ పరమ శివనామము లాత్మ నామములు. శివదర్శనమున నంగీకరించు తత్త్వములన్నియు జీవునందున్నవి. జీవునందేకాదు, విశ్వమంతట నున్నవి. జడమునందున్నవి. అజడమునందున్నవి.వ్యష్టి సమష్టిరూపమున నంతట నున్నవి. ఇట్లనంత వస్తువులందున్ననవి యేకరూపములు. ఏకరూపమున నవి యంతట నున్నవి. ఇవి దేశకాలాతీతములయినను సర్వదేశసర్వకాలములందేకరూపమున నున్నవి. శివుడీ విశ్వమున వ్యాపకరూపమున నున్నాడు. అయినను విశ్వాతీతుడు. శివాదిస్తంబపర్యంత మన్నియు ప్రకాశైక ఘన శివాభిన్నరూపమున నె స్ఫురించును. "అఖిలం అభేదేనైవ స్ఫురతి." ఈ తత్త్వముల కతిరిక్తముగా గ్రాహ్యము లేదు. గ్రాహకము లేదు.

ఈ పరమ శివభట్టారకుడు నానా వైచిత్ర్యముల రూపమున స్వయం స్ఫురణము పొందును.

ఆత్మైవ సర్వభావేషు స్ఫురన్నిర్వృతచిద్విభుః
అనిరుద్ధేచ్ఛాప్రసరః ప్రసరద్దృక్క్రియః శివః

శివదర్శనవిధుల శివభావన మనేకవిధముల నున్నది. అందు లింగరూపు నర్చించుట యొక మహాభావము. ఈ భారతదేశమున ననేక శివలింగములున్నవి. భారతదేశమున నెన్నియున్నవో యని తలచుటయు తప్పు తలంపు. భారతీయు డెవడును శివేతరము భావింపడు. శివేతరకృతి భావించిన భారతీయుడు భవదేవమహాభావమున భవ విభవము కల్గియు భవవిభవ విముక్తుడగు చున్నాడు. దేవప్రతిష్ఠిత ములు అసురప్రతిష్ఠితములు ఋషిప్రతిష్ఠితములు మానవప్రతిష్ఠితములు నగు శివాయతనములు కలవు. ప్రతిష్ఠాకల్పానుసారమున పరిశీలించిన నింక నెన్నియో విశేషము లవభాసించును. వాని నీ చతుర్వర్గమున జేర్పవచ్చును. ఎవరు ప్రతిష్ఠించిన లింగమయినను శివలింగమె. ప్రతిష్ఠాసంకల్ప సమయముననె సర్వము శివభావాయిత మగును. శివదర్శనము లింగావిర్భూతి సమయమున గలుగజేయు భావమునె ప్రతిష్ఠాసమయమున పూజాసమయమున సాధకుడు సంభావించును. కావున శివాయతనము లన్నియు నొక శివాయతనము. స్కాంద పురాణాదులలో నాగమగ్రంథములలో శివనామము లనేకము లున్నవి. అన్నియు నన్ని శివోపాసనా విశేషములను సూచింప గలవు. ఒక్కొక ప్రయోజనమున కొక్కొకటిగా భావించుటయు భవదేవమార్గమె. శివక్రియామా విశేషములను తెలియజెప్పు శివరాత్రి కథ లనేకములున్నవి. వానిని శివభక్తులు విశదముగా గుర్తింపవలెను. కథలలో గూఢముగ తత్త్వముండును. ఆ తత్త్వము నతత్త్వవిదులు చూడరు. చూచువారు తత్త్వము చూచి శివుని చూడగలరు. శివ ధ్యాతలు కానివారలు కానివారలై సంతతము సంతాపసంతతి

పొందుచుందురట. కాశ్మీరమున శివతీర్థములు, శివక్షేత్రములు కలవు. సౌరాష్ట్రమున గలవు. గుజరాతమున కలవు. మహారాష్ట్రమున నున్నవి. మధ్యరాష్ట్రమున నున్నవి. ఉత్తరప్రదేశమున నేపాల మున విహారభాగమున కామరూపమున వంగాంగ కళింగములం దుత్కలమున కేరల తమిల కర్ణాటములందు కలవు. ఆయా స్థలము లందలి శివదేవుల పేరుల నన్నిటిని శ్లోకపఱచి వాచ్యవాచక సంభిన్న సంవిద్భావమున పారాయణ మొనరించుటయు నుపా సనా విశేషమగును. విశ్వేశ్వర బృహదీశ్వర వ్యాఘ్రేశ్వర జంబు కేశ్వర సోమేశ్వర కుక్కుటేశ్వరాది సంకేతములందు స్థల విశిష్టతా సూచనము నుండును. శివునెట్లు భావింతుము”. శ్మశానశివుడు- భుజంగభూషణశివుడు- గరలగలుడు- గంగాధరుడు. శూలధారి- చంద్రచూడ- భిక్షార్థి చర్మధారి- అర్ధనారీశ్వర- కపాలి మొదలగు నామములు కల శివదేవునందు ఆయాసంప్రదాయ చర్యావిశేషమును స్ఫురించును. విశ్వేశ్వరుని విశ్వమయునిగా భావించువారలు వస్తు వర్తనములోని విశేషములు భావింతురు. సతీవల్లభుడు- విరహ- తాపస- గౌరీనాధ- శృంగారశివ- వినాయకజనక- కుమారతాత- ప్రమధాధిప- త్రిపురారి- అంధకరిపు- కామహర- కాలభైరవ- ప్రభృతి శివసంకేతములలో కధానుసంధానముకల భవదేవభావపూజ భావించును, శివభావన మెంతటిదో! తద్భావభావనా భావితులు శబ్దశాస్త్ర మావిష్కరించిరి. అలంకార శాస్త్ర నిర్మాతలయిరి. యోగాది శాస్త్రములు నిర్మించిరి. కవితా ప్రతిభులయిరి. నాట్యము నకు శివదర్శనము మూలము. నాట్యవేదములోని యంగహారములు హారప్రీతి సంపాదకములు. శంకరాభరణాది రాగములు శివదర్శన లీలలు. ఇట్టివన్నియు నాస్వాద్యమాన మనోహరములు.

మనము దేవుని స్తుతింతుము. ఆస్తుతి కొంత వీరత్వము సంపా దింపగలదు. అపుడు భగవానుని నిజవీర్యమును గుర్తింపగలము. శివ దర్శనమున శివదర్శనము కలిగినేని కరణము భావన మక్కఱకాదు.

జ్ఞాతే శివత్వేసర్వస్థే ప్రతిపత్త్యాదృఢాత్మనా
కరణేన నాస్తికృత్యం నాపిభావనయాపివా

కావున నిరంతర శివభావ విజ్ఞానమునకై శివసంభావన మొనరించుట యుక్తము. ఇట్లు పెద్దలు భావించిరి. నేను భావింతును. అందరు భావింపుడు.

నానాప్రకార సంసారప్రకాశన విశారదః
క్రీడన్ విచిత్రైరాకారైర్జయత్యేకో మహేశ్వరః
ఏకాప్యనేకరూపైవ వాచ్యవాచక భంగిభిః
సర్వజ్ఞస్య పరాశక్తిర్భానతాం ప్రతిభానతాం
శ్రీమత్కళ్యాణవపుషః శంభోర్భక్తి ముపాస్మహే
యదేకభాజనంకాయో మోక్షాదప్యతిరిచ్యతే

శివుడొకడు విచిత్రాకార క్రీడాచతురుడు. నానాప్రకారముల ప్రపంచమును ప్రకాశన మొనరించును. ఆ శివుని పరాశక్తి యొకటియైన ననేకరూపములనవభాసించుగావుత. శివభక్తియే కావలయును. అదియున్న మోక్షమువలదు. ఇట్లనిపించు శివభక్తి నారాధింతును.

తత్త్వన్మోహతమోఽపహం పశుపతే
యల్లక్షణం తావకం
సర్వం పాణినిబద్ధ మిత్యధిగతం
యేనాద్వితీయోఽపి చ
యన్మాహాత్మ్య వశాదుదేతిచపరా
వాగ్వాచ్య వైచిత్ర్యనూ
స్తన్మేసంవిది సామరస్య మధునా
పుష్ణాతు లోకోత్తరమ్.

మాధవరామశర్మ.



శ్రీ మహతీ శంకర్

[ ఆవిష్కరణ మహాసభలో ద్వాదశ జ్యోతిర్లింగస్తోత్రములను శ్రావ్యముగా గానముచేసి శ్రోతల నలరించిరి ]

తనరారె సౌరాష్ట్రమున "సోమనాథుఁడై
శ్రీశైలమున "మల్లికేశుఁ" డయ్యె
అలరె నుజ్జయిని "మహాకాళుఁ" డోంకార
మున "పరమేశ్వరుం" డనఁ దనర్చె
తనరె హిమాద్రిఁ "గేదారేశుఁడై" డాకి
నిని "భీమశంకరుం" డన వెలింగె
చెలువొందె వారణాసిని "విశ్వనాథుఁ"డై
యెసఁగె గౌతమిఁ "త్ర్యంబకేశ్వరుఁ"డన
ఆ చితాభూమి "వైద్యనాథాఖ్య" నొప్పె
దారుకావని "నాగేశుఁడై రహించె
సేతువునను "రామేశుఁడై" చెలఁగె, నల శి
వాలయమ్మున "ఘుశ్మేశుఁ" డయ్యె స్వామి॥

"కరుణశ్రీ"

## ద్వాదశ
## జ్యోతిర్లింగ క్షేత్రములు

సౌరాష్ట్రే సోమనాథం చ
శ్రీశైలే మల్లికార్జునమ్।
ఉజ్జయిన్యాం మహాకాళ
మోంకారే పరమేశ్వరమ్॥

కేదారం హిమవత్పృష్ఠే
డాకిన్యాం భీమశంకరమ్।
వారాణస్యాం చ విశ్వేశం
త్ర్యంబకం గౌతమీ తటే॥

వైద్యనాథం చితాభూమౌ
నాగేశం దారుకావనే।
సేతు బంధే చ రామేశం
ఘుశ్మేశం చ శివాలయే॥

## స్తోత్రము

౧

సౌరాష్ట్రదేశే విశదేఽతిరమ్యే
జ్యోతిర్మయం చంద్రకళావతంసమ్।
భక్తిప్రదానాయ కృపావతీర్ణం
తం సోమనాథం శరణం ప్రపద్యే॥

### తాత్పర్యము

పరమ పవిత్రమును పరమరమణీయమునైన సౌరాష్ట్ర దేశమునందు భక్తజనసంరక్షణార్థము శ్రీసోమనాథ స్వరూపముతో పరమేశ్వరుఁడు విరాజమానుఁడై యున్నాఁడు. జ్యోతిర్మయ మూర్తియు బాలచంద్రుని జటాజూటమున ధరించినవాఁడును కరుణామయుఁడు నైన యా పరమశివుని చరణకమలములను శరణు పొందుచున్నాను.

## క్షే త్ర ము



శ్రీ శైలే మల్లికార్జునమ్

## స్తోత్రము

### ౨

శ్రీశైలసంగే విబుధాతిసంగే
తులాద్రితుంగేఽతిముదా వసంతమ్।
త మర్జునం మల్లికపూర్వ మేకం
నమామి సంసార సముద్రసేతుమ్॥

### తాత్పర్యము

కైలాసపర్వముతో సమానమైన యౌన్నత్యము గలిగి సర్వదా దేవబృందసంసేవ్యమానమైన శ్రీశైల శిఖరమునందు మహాదేవుఁడు మల్లికార్జునస్వరూపముతో వేంచేసియున్నాఁడు. చిదానందమయుఁడును సకల లోకానీకములకు నేకైక ప్రభువును సంసార సముద్రమును దాటించుటకు సేతువువంటివాఁడు నైన యా సదాశివుని పదాంబుజములకు భక్తితో నమస్కరించుచున్నాను.

## స్తోత్రము

## 3

అవంతికాయాం విహితావతారం
ముక్తిప్రదానాయ చ సజ్జనానామ్।
అకాలమృత్యోః పరిరక్షణార్థం
వందే మహాకాళ మహామరేశమ్॥

### తాత్పర్యము

అకాలమృత్యువును పటాపంచలు చేసి భక్తజనమును పరిరక్షించుటకు సజ్జనులకు మోక్షమును ప్రసాదించుటకు నుజ్జయినీ మహాపట్టణములో మహాకాళేశ్వర స్వరూపముతో ఆదిదేవుఁడు అవతరించియున్నాఁడు. సమస్త బృందారక బృందములకు వందనీయుఁడైన యీ బాలేందుశేఖరునకు ప్రణామము చేయుదును.

## స్తోత్రము

౪

కావేరికా నర్మదయోః పవిత్రే
సమాగమే సజ్జనతారణాయ।
సదైవ మాంధాతృపురే వసంత
మోంకార మీశం శివమేక మీడే॥

### తాత్పర్యము

పరమపావనమై కావేరీ నర్మదా సంగమ ప్రదేశమైన మాంధాతృపురమున దుష్టశిక్షణ శిష్టరక్షణార్థమై ఓంకారేశ్వర స్వరూపముతో శంకరుఁడు సర్వదా విజయంచేసియున్నాఁడు. సకల భువనములకు స్వామియు సమస్తమంగళ మయ స్వరూపుఁడును ఏకైకప్రభువునైన యా శ్రీకంఠుని చేతులుమోడ్చి సంస్తుతించెదను.

## స్తోత్రము

శ్లో

మహాద్రి పార్శ్వేచ తటే రమంతం
సంపూజ్యమానం సతతం మునీంద్రైః।
సురాసురై ర్యక్ష మహోరగాద్యైః
కేదార మీశం శివ మీశ మీడే॥

### తాత్పర్యము

మహోన్నతమైన హిమాలయ పర్వత సానువులలో కేదారనాథ స్వరూపముతో ప్రేమపురస్సరముగ స్వామి విచ్చేసియున్నాఁడు. శమదమాది గుణసంపన్నులైన మునీంద్రులు, దేవతలు, దానవులు, సిద్ధులు, సాధ్యులు, యక్షులు, కిన్నరులు, కింపురుషులు, ఉరగులు మొదలగువారిచే సర్వకాల సర్వావస్థలయందు సంపూజ్యమానుఁడును, చరాచరాధీశుఁడును, సదాశివపరబ్రహ్మయునైన ఆ జగత్ప్రభువునకు జోహారు లర్పించుచున్నాను.

## స్తోత్రము

### ౬

యో డాకినీ శాకినికా సమాజైః
నిషేవ్యమాణః పిశితాశనైశ్చ।
సదైవ భీమాది పదప్రసిద్ధం
తం శంకరం భక్తహితం నమామి॥

### తాత్పర్యము

శాకినీ డాకినీ సమాజములు రక్తస్సమూహములు పరివేష్టించి సేవించుచుండగా భీమశంకర స్వరూపముతో పరమేశ్వరుఁడు భీమానది యుద్గమస్థానము నందు నిత్యసన్నిహితుఁడై యున్నాఁడు. సకలలోకహితంకరుఁడు భక్తజనవశంకరుఁడైన ఆ శంకరునకు వినయ వినమిత శిరస్కుఁడనై మ్రొక్కుచున్నాను.

## స్తోత్రము

### 8

సానంద మానందవనే వసంత
మానందకందం హతపాపబృందమ్।
వారాణసీనాథ మనాథనాథం
శ్రీవిశ్వనాథం శరణం ప్రపద్యే॥

### తాత్పర్యము

ఆశ్రయించినవారి యనేకజన్మల పాపపుంజములను భస్మీకరించుచు ఆనందమునకు మూలకందమై 'ఆనందకానన' మను ఖ్యాతిగాంచిన సమస్త పుణ్యరాశి యగు వారణాసియందు విశ్వనాథస్వరూపముతో విశ్వప్రభువు విరాజిల్లుచున్నాఁడు. అనాథులకు నాథుఁడై శ్రీ అన్నపూర్ణేశ్వరీ సనాథుఁడైన ఆవిశ్వనాథుని యంఘ్రికమలముల నాశ్రయించుచున్నాను.

## స్తోత్రము

౮

సహ్యాద్రిశీర్షే విమలే వసంతం
గోదావరీ తీర పవిత్రదేశే।
యద్దర్శనా త్పాతక మాశు నాశం
ప్రయాతి తం త్ర్యంబక మీశ మీడే॥

### తాత్పర్యము

పరమ పవిత్రమైన గోదావరీ తీరప్రదేశము నందు స్వచ్ఛమైన సహ్యాపర్వత శిఖరాగ్రమున త్ర్యంబకేశ్వర స్వరూపముతో దేవదేవుఁడు సాక్షాత్కరించియున్నాఁడు. సందర్శనమాత్రము చేతనే సమస్త పాతకములను క్షణకాలములో శమింపఁజేయువాఁడైన యా మూఁడు కన్నుల స్వామికి మ్రొక్కుచున్నాను.

## స్తోత్రము

౬

పూర్వోత్తరే ప్రజ్వలికానిధానే
సదా వసంతం గిరిజాసమేతమ్।
సురాసురారాధిత పాదపద్మం
శ్రీవైద్యనాథం తమహం నమామి॥

### తాత్పర్యము

పూర్వోత్తరమునందున్న ప్రజ్వలికాభిధానమైన పుణ్యస్థానమున పార్వతీదేవీ సహితుఁడైన పరమేశ్వరుఁడు వైద్యనాథ స్వరూపముతో వెలుఁగొందుచున్నాఁడు. సురాసుర సమారాధితచరణసరోజుఁడైన యీ పరమకారుణ్యమయమూర్తిని ప్రాంజలినై ప్రార్థించుచున్నాను.

## క్షేత్రము



నాగేశం దారుకావనే

## స్తోత్రము

## ౧౦

యామ్యే సదంగే నగరేఽతిరమ్యే
విభూషితాంగం వివిధైశ్చ భోగైః।
సద్భక్తి ముక్తి ప్రద మీశ మేకం
శ్రీనాగనాథం శరణం ప్రపద్యే॥

### తాత్పర్యము

దక్షిణమున సర్వతోముఖ సౌందర్యమయమైన ద్వారకానగరము సమీపమునందు నానావిధ భోగిభోగములచే అలంకరింపఁబడినవాఁడై నాగనాథనామముతో జగదీశ్వరుఁడు సన్నిధిచేసి యున్నాఁడు. భక్తిముక్తి ప్రదాతయైన యీ శక్తిస్వరూపుని శరణుపొందెదను.

## స్తోత్రము

౧౧

సుతామ్రపర్ణీ జలరాశియోగే
నిబద్ధ్య సేతుం విశిఖై రసంఖ్యైః।
శ్రీరామచంద్రేణ సమర్పితం తం
రామేశ్వరాఖ్యం నియతం నమామి॥

### తాత్పర్యము

పరమ శోభాభాసమానమైన తామ్రపర్ణి సముద్ర సంగమస్థలమున రామనాథ క్షేత్రమున ముల్లోకము లేలు మూడుకన్నులస్వామి రామేశ్వర స్వరూపముతో రంజిల్లుచున్నాఁడు. అసంఖ్యాకములైన బాణములతో సేతుబంధన మొనర్చిన శ్రీరామచంద్రునిచేత సమర్పితుఁడైన యా లోకైకనాథుఁడు కైలాసనాథునకు నిశ్చలనియమముతో నమస్కరించుచున్నాను.

## స్తోత్రము

### ౧౨

ఇలాపురే రమ్యవిశాలకేఽస్మిన్
సముల్లసంతం చ జగద్వరేణ్యమ్।
వందే మహోదారతరస్వభావం
ఘుశ్మేశ్వరాఖ్యం శరణం ప్రపద్యే॥

### తాత్పర్యము

సురమ్యమై సువిశాలమైన ఇలా (ఎల్లోరా) పురమున నిత్యతేజోవిరాజితుఁడును నిఖిలలోక పూజితుఁడునైన దేవాదిదేవుఁడు మహాదేవుఁడు ఘుశ్మేశ్వరస్వరూపముతో నలరారుచున్నాఁడు. అత్యంత కారుణ్యముతో ఆశ్రితులకు కామితార్థము లిచ్చి కటాక్షించు నా కల్యాణమూర్తికి కరములు మోడ్చి నమస్కరించుచున్నాను.

## ఫలశ్రుతిః

జ్యోతిర్మయ ద్వాదశ లింగకానాం
శివాత్మనాం ప్రోక్త మిదం వరేణ।
స్తోత్రం పఠిత్వా మనుజోఽతి భక్త్యా
ఫలం తదాలోకనజం భజేచ్చ॥

## తాత్పర్యము

ఇది పవిత్రమైన స్తోత్రము. జ్యోతిర్మయములై పరమశివస్వరూపము లైన ద్వాదశ లింగముల స్తోత్రము. ఏమానవుఁడైనను దీనిని పరమభక్తి యుతుఁడై పఠించినచో ద్వాదశ జ్యోతిర్లింగ క్షేత్రములను సందర్శించుటచేత కలుగు మహా ఫలము వానికి సంప్రాప్తించును.



శ్రీమదష్టాదశ మహాపురాణ ప్రదానమహోత్సవ సంధర్భమున పూజచేయుచున్న శ్రీ మనికొండ కాశీవిశ్వనాధము

# శ్రీ విశ్వనాథ సత్యనారాయణ

జనితార్తింబడి రమ్యమున్ విశదమౌ
సౌరాష్ట్ర దేశంబునం
దున సేవించెడు స్వామి పాప నిచయాం
దోళాకృతిన్ శ్రీ మహే
శుని గంగాసరిదంబు సంగత శిరున్
జ్యోతిర్మయున్ సోమనా
థుని శ్రీ చంద్రకళావతంసుని భజిం
తున్ ముక్తి వాంఛా మతిన్ ॥౧॥

శ్రీగిరి మల్లికార్జునుని
చేతులు మోడ్చి నమస్కరించెదన్
సాగెడు సంస్కృతి ప్రథిత
సాగరసేతువు ముక్తిహేతువున్
తూగెడు నట్టి క్రొవ్వలపు
తో భ్రమరాయుతుఁడై తులాద్రిరాట్
భాగమునందు నిచ్చలు ని
వాసముసేయు వృషేంద్రకేతనున్. ॥౨॥

ఓలి నమన్మనోజ్ఞముగ
నుజ్జయినీ నగరీ బహిశ్చరత్
కేళివనీ రసాల సుమ
కేసర సంగత చంద్రమః కళా
కీలిత మస్తకున్ ప్రభుని
కేవల భావపయోనిధిన్ మహా
కాళు అకాలకాలునకుఁ
గాలుని కేలుమొగిడ్చి మ్రొక్కెదన్. ॥3॥

ప్రారంభించిన కాలమై కృతయుగం

బై నర్మదా నూత్నకా

వేరీ సంగమ ధాత్రి ధర్మనిచయా

విర్భూతి మాంధాత ము

న్నారాజ్యంబును జేసినట్టి నగరం

బైనట్టి యచ్చోటి యోం

కారేశున్ ప్రభులింగమూర్తి శివునిన్

గైమోడ్చి యర్చించెదన్. ||౪||

లలి నత్తింటి పయిం గలట్టి వలపె

ల్లన్ దీప్తమౌనట్టు ల

మ్మల పార్శ్వంబునయందు నత్తికొను స

మ్యగ్గేహమున్ గట్టుచున్

దలపై వెన్నెల హాసు చిమ్మికొను కే

దారేశు సేవింతు నా

తలపుల్ ముట్టిన చీఁకటుల్ విడిలు చం

దంబుల్ ప్రబోధింపఁగన్. ||౫||

మనుజాదిప్రచయాభి వందితుని భీ
మా శంకరక్షేత్ర వా
సిని ఘోరారవమర్దళస్వన పిశా
చీ శాకినీ ఢాకినీ
జన సంసేవితు శంకరున్ గొలుతు దీ
క్షాబద్ధభక్తౌఘ పా
వనితాంతానిల భుగ్భుజంగపతి దీ
వ్యద్భూషణున్ హృత్పతిన్. ॥౬॥

ప్రళయ మహా పయోనిధి త
రంగము లుప్పరమంటువేళ న
వ్వల వటపత్రమం దొకడు
వచ్చి మహాశివలింగమూర్తి యి
వ్వల నొకఁడైన కాశిపుర
వాసిని తారకమంత్రదేశికున్
కొలిచెద విశ్వనాథ శివుఁ
గొండకుమారిత గుండె దివ్వియన్. ॥౭॥

లీలన్ మల్లెలు విచ్చు సహ్యగిరి మా
శిన్ దివ్యగోదావరీ
శ్రీ లీలాంబులు గోళ్లచిల్కనయటుల్
చిందించు తీరమ్మునన్
మేలౌచోటున నిల్లుకట్టికొను సా
మిన్ త్ర్యంబకున్ పుష్పబా
ణాలీఢాంబకు గొల్తు పాపచయరీ
ణా ప్రౌఢ బాణాకృతిన్. ॥౮॥

పోషింపన్ నిజభక్త సంచయములన్
పూర్వోత్తరంబందు ని
ర్దోష ప్రజ్వలికా సనాథమున యం
దున్ దేవగేహంబునన్
తోషంబొప్ప గయాసమీపమునయం
దున్ వైద్యనాథోజ్జ్వలద్
వేషంబూనిన పార్వతీధవుని సే
వింతున్ ముకుందాకృతిన్. ॥౯॥

సౌరాష్ట్రంబున నాగనాథ మను భా
స్వత్ క్షేత్రమందున్ ఫణా
రారాజద్భుజగేంద్ర భూషలు శరీ
ర మ్మెల్ల భోగమ్ములై
దూరీకృన్నిఖిలాఘమూ ర్తిని భజిం
తున్ నాగనాథున్ హిమా
నీ రమ్యోజ్జ్వల ధాత్రిభృద్దుహితృ ప్రా
ణేశున్ మనోనాయకున్. ॥౧౧॥

గాజర లొప్ప సేతువును
కట్టిన చోటను హేమతామ్ర ప
ర్ణీ జలరాశి సంగమ ధ
రిత్రిని శ్రీరఘురాముచే ప్రతి
ష్ఠా జయ మంది రామశివ
సంగత నామము పొందు ధూర్జటిన్
కై జత మోడ్చి మ్రొక్కెదను
కమ్మని భక్తి పరీమళింపఁగన్. ॥౧౧॥

శ్రీశితకంఠ హాలహాల
రేఖ మహోఘము లార్పునట్టి ఘు
శ్మేశు నిలాపురీ నివస
నేచ్ఛుని స్వేచ్ఛుని గొల్తు ముక్తి పే
రాసను బొల్చి దేవగిరి
రాజ్యమునందున నిల్లుకట్టు స
ర్వేశుని చంద్రమో విమల
హీరమణీ పరిలంబకేశునిన్. ॥౧౨॥

ఫ ల శ్రు తి

ఇది పంద్రెండగు వెల్గులింగముల సా
హిత్యమ్ము మోక్షేందిరా
స్పదమౌ శైవ మహత్త్వ పూర్ణము తితీ
ర్షాబుద్ధి నెవ్వండు లో
యెద భక్తిన్ బఠియించు దీని శివసా
హిత్యమ్ము దీపింప నీ
బ్రదుకుం గష్టము లెల్ల నీది తుది సం
పాదించు సాయుజ్యమున్.

## మధ్వశ్రీ పల్లె
## పూర్ణప్రజ్ఞాచార్యులు

దివ్యతరమైన సౌరాష్ట్రదేశమందు
బత్తివెలుఁగును బ్రజకు రేకెత్తఁజేయ
జ్యోతిరాకృతి వెలసిన సోమనాథ!
శైలజానాథ! శశిభూష! శరణు శరణు!! ॥౧॥

సంగత విబుధమ్ము మహో
త్తుంగమ్ము తులాద్రివోలె ధుతభంగము శ్రీ
శృంగి గల మల్లికార్జున
లింగము ధృతగంగ మంజలింతుఁదరింతున్.॥౨॥

ప్రజలకు నకాల మృత్యువుఁ బాఱఁద్రోలఁ
బరమభక్తులకున్ మోక్షపట్ట మీయ
ఉజ్జయినియందు నవతార మొందినట్టి
కాలగళుఁ గొల్తు శ్రీ మహాకాళ దేవు. ॥౩॥

తటిని కావేరియును నర్మదాస్రవంతి
కలియు పుణ్యస్థలిన్ సాధువులఁ దరింపఁ
జేయ మాంధాతృపురిని వసించు వేల్పు
నతు లొనర్చెద నోంకారనాము సోము. ॥౪॥

ఉత్తరమున హిమవదుర్వీధరోపాంత
తటమునన్ రమించు ధవళదేహు !
ముని సురోరగాది వినతుఁ గేదారేశు
శివు నుతింతు నిష్టసిద్ధి కొఱకు. ॥౫॥

శాకినీ డాకినీ సమాజములుఁ బిశిత
భోజనులుఁ దన్నుఁ గొల్వఁగాఁ బొలుచు భీమ
శంకరునకు స్వభక్త వశంకరునకు
శైల జామాత కంజలి సంఘటింతు. ॥౬॥

కంద మానందమున, కఘబృందమునకు
వైరి నానందకాననవాసి నీశు!
నాథు శ్రీవారణాసి, కనాథనాథు
విశ్వనాథుని శరణంబు వేఁడికొందు. ॥౭॥

దివ్యగోదావరీ నదీ తీరభూమి
సహ్య భూధర శిఖర రాజమున నొప్పు
త్ర్యంబకేశు భజింతు యద్దర్శనమునఁ
బంచపాతకములు పటాపంచలగునొ. ॥౮॥

ప్రజ్వలీపురి నీశాన్య భాగమందు
నార్యతోఁ గూడి దేవాసురార్చలందు
వైదనాథుని భవరోగవైద్యనాథు
నైదుపదిఁజేసి నాసేమ మరయఁ గొలుతు. ॥౯॥

యామ్యదిశ నందమైన సదంగనగరి
భోగజాల సుమాలా విభూషితాంగు
భక్తి ముక్తుల నొసగంగ బద్ధదీక్షు
శర్వు శ్రీనాగనాథేశు శరణుఁజొత్తు. ॥౧౦॥

తామ్రపర్ణి సముద్రుండు దమ తరంగ
హస్తముల నాడు కూడలియందు విశిఖ
తతుల రాముండు సేతుబంధన మొనర్చి
నిలిపినమహేశు రామేశుఁగొలుతు భక్తి. ॥౧౧॥

లలితము విశాలమైన యిలాతలమున
నుల్లసిల్లుచు గిరిజతో నొప్పు వేల్పు
వందనీయుఁ డుదారుఁ డర్ధేందుమౌళి
హరుఁడు ఘుశ్మేశ్వరాఖ్యుడు శరణునాకు ॥౧౨॥

ఫ ల శ్రు తి

ధీరుఁడు శంకరుండు గురు
దేవుఁడు శిష్యులు సంతరింపఁగా
భారతదేశ మంతయును
బర్యటనం బొనరించి జ్యోతిరా
కారక షడ్ద్వయీ గరళ
కంధర లింగములన్ స్తుతించె, నె
వ్వా రివి చూచివత్తురో! స్త
వంబు పఠింతురో! ముక్తి వారికే.

## శ్రీ దోహా
## వేంకటస్వామి గుప్త

సౌరాష్ట్ర దేశమందున్
శ్రీరమ్యున్ జ్యోతిరమలు శీతకిరణ కో
టీరుం గారుణ్యాబ్ధి న
నారతమున్ గొల్తు సోమనాథుని నీశున్. ॥౧॥

శ్రీ శైలతులాద్రిన్ విబు
ధేశనుతంబున వసించు వృజిన భవాంభో
రాశి హరు మల్లికార్జును
నీశున్ బరమున్ భజింతు హితముక్తికరున్ ॥౨॥

శ్రీకర మవంతికన్ సుజ
నాకర ముక్తిదుఁ డకాల మగు మృతి నడఁపన్
వీఁకఁ దగు మహా కాళే
శాకృతి యగు నభవు శివుని నారాధింతున్ ॥3॥

కావేరీ నర్మదలున్
భావుకముగఁ గలియు నెడను వరమాంధాతృ
క్ష్మా వెలయు బుధహితు మహా
దేవుని నోంకారశివు మదిన్ భజియింతున్. ॥४॥

ఘనగిరి పార్శ్వమునం దగు
ముని రక్షో యక్ష దేవ పుణ్యాహినతున్
కన దమల విభవు గొల్చెద
ననఘున్ గేదారనాథు నభవుని శివునిన్. ॥౫॥

శాకినికా డాకినికా
నీకాసుర సేవ్యమాను నిర్మలతర సు
శ్లోకుండు భీమశంకరు
లోకేశు భజింతు భక్తలోకావనునిన్. ॥౬॥

ఆనందకాననంబున
సానందముగా వసించు నఖిలాఘహరుం
డైన యనాథావను హృద
యానన్ విశ్వేశుఁ గాశికాధిపుఁ గొలుతున్. ॥౭॥

గోదావరి దరి సహ్య మ
హోదారాద్రి శిఖరమున నొప్పు మహిత నా
నా దురితాంతకు వినమిత
వేదున్ శ్రీ త్ర్యంబకేశు వినుతింతు మదిన్. ॥౮॥

పూర్వోత్తరఁ బ్రజ్వలికన్
ఖర్వేతర ముదమునఁ దగు గౌరీ సహితున్
బూర్వామరామరార్చితు
శర్వున్ శ్రీవైద్యనాథు సతతముఁ గొల్తున్. ॥౯॥

జముదెస సదంగనగరో
త్తమమున నానాహి భూషిత విమల రూపున్
సుమధుర భక్త్యపవర్గదు
నమలిను శ్రీనాగనాథు నర్థి భజింతున్. ॥౧౦॥

మొగిఁ దామ్రపర్ణి జలనిధి
ని గలియు నెడ రాముఁడు శరనికరంబున్ నో
లిఁ గొలుపు సేతువనం దగు
సుగమున్ రామేశు భక్తసులభు భజింతున్॥౧౧॥

సువిశాల మిలానగరిన్
నివసించు జగద్వరేణ్యు నిర్మలు నౌదా
ర్యవిశేషు శరణుఁజొత్తున్
భవహరు ఘుశ్మేశ్వరాఖ్యుఁ బావనచరితున్ ॥౧౨॥

ఫ ల శ్రు తి

జ్యోతిర్లింగ ద్వాదశ
కాతిపవిత్ర శివమతి యి దల శంకర వి
జ్ఞాతృవర కృతము చదివిన
శ్రీ తగు నెల్ల శుభములును జెందు నల నరున్.

# శ్రీ ముదిగొండ వీరభద్రమూర్తి

రమ్యతరము విశదమ్ము సౌరాష్ట్రధర కృ
పావతీర్ణుండు భక్తుల బ్రోవ నచట
జంద్రఖండావతంసుండు శరణ మతఁడె
నాకు జ్యోతిర్మయుఁడు సోమనాథుఁ డనఁగ.॥౧॥

శ్రితవిబుధాతిసంగమును
శ్రీధరణీధరసంగమౌ వనా
న్వితతులశైలతుంగమున
బిట్టు లసించి వసించు మల్లికా

యుత ప్రథితార్జునాఖ్యుని మ
హోజ్జ్వలు నొక్కని నందికేతువున్
సతము మదాత్మ కొల్చుకొను
సంసృతిభారసముద్రసేతువున్. ॥౨॥

యోగ్యుల నకాలమృత్యువునుండి ప్రోచి
ముక్తుల నొనర్ప నవతారమును గ్రహించె
నట మహాకాళుఁ డనఁగ మహాసురేశుఁ
డీశ్వరుఁ డవంతిపురి నమియింతు వాని. ॥౩॥

తనరు గావేరికయు నర్మదయును గలియు
పూతమాంధాతృపురమునఁ బుణ్యులను ద
రింపఁజేయుచు నోంకారలింగ మొకటి
యెపుడు నీశమ్ము శివము నమింతు దాని. ॥౪॥

సకలయక్షసురాసురసర్పరాజ
ముఖ్యులు మునీంద్రులునుగొల్వభూధరేంద్ర
పార్శ్వతటరమమాణుడై బరగు నెపుడు
నెవ్వఁ డట్టి కేదారేశు నీశు దలతు. ॥౫॥

శాకినీ డాకినులును రాక్షసులు గొలువ
దనరు నెవఁడు భీమాది పదప్రసిద్ధుఁ
డగుచు నేనాఁడు శంకరు నతని నెంతు
భక్తబృందవశంకరు భవముఁ జింతు. ॥౬॥

ఆనందాటవినున్నవాఁడట శివుం
డానందకందం బఖం
డానందమ్మున విశ్వనాథుఁడను నా
ఖ్యాఖ్యాతిమై వారణా
సీనాథుండు ననాథనాథుఁడుగ సం
సేవింపరే వాని స
ద్ధ్యానోధ్వాంతదినాధినాథుని జనుః
పారమ్ము నొందం బ్రజల్. ॥౭॥

దనరు నెవరు గోదావరీతటపవిత్ర
తల విమల సహ్యశిఖరి మస్తకమునందు
నెవరిఁగాంచిన బాపమ్ము లిట్టె తొలఁగు
నాయనను త్ర్యంబకు భజింతు నహరహమ్ము॥౮॥

ప్రజ్వలిక యన బూర్వోత్తరమునఁ గలదు
దేశ మట నెల్లపుడు బార్వతీసనాథుఁ
డలరును సురాసురారాధనాంచితపద
పద్ముఁ డాతని గొల్తు శ్రీవైద్యనాథు. ॥౯॥

యామ్యమున నతిరమ్యసదంగపురిని
నైకభోగవిభూషితాంగమున నొప్పు
నాగనాథుఁ డేకైకుండు నాకు శరణ
మీశ్వరుఁడు భుక్తిముక్తుల నిచ్చువాఁడు. ॥౧౦॥

సేతువును గట్టి తామ్రపర్ణీతరంగ
రంగదబ్ధితటమ్మున రామమూర్తి
లెక్కలేని బాణమ్ములఁ జక్కనేసి
కొల్చె రామేశ్వరుని నేను గొల్తు నతని. ॥౧౧॥

చారువిశాల మగు నిలా
పూరున ఘుశ్మేశ్వరాఖ్యఁ బొలుపొందు మహో
దారతరభావు శివు సక
లారాధ్యు జగద్వరేణ్యు నారాధింతున్. ॥౧౨॥

## ఫ ల శ్రు తి

స్తోత్ర మియ్యది పదిరెండు జోతుల శివ
లింగములు కొనియాడబడంగ జెప్పఁ
బడె నొక వలంతిచే దీని భక్తిఁ జదివి
ధన్యుఁ డగుగాత నరుఁడు తద్దర్శనమున.

## శ్రీ వా వి లా ల
## సో మ యా జు లు

సౌరాష్ట్రస్థిత సోమనాథు విలసత్
సౌదామనీ దివ్యశో
భారమ్యాలయు లోకరక్షణ మహా
వ్యాపార లీలారతున్
తారానాథ కళావతంస సుభగున్
తత్త్వార్థ భక్తి ప్రదున్
చేర న్నే శరణంబు గైకొనెద, వా
సింగన్న జ్యోతిర్మయున్ ॥౧॥

విబుధానంగ తులాద్రి తుంగ గృహ, ము
ర్వీధ్రమ్ము శ్రీశైలపుం

బ్రబలోద్యద్ఘన శృంగకేళి భ్రమరాం
బాప్రీణనాహ్లాద షా

డబ పీయూష రసార్ణవోజ్వలుని, ఒ
డ్డారంపు సంసార సే

తు బహూపజ్ఞుని మల్లికార్జునుని, గొ
ల్తున్ ప్రీతి కైమోడ్పులన్. ॥౨॥

ఘనమై యొప్పగ నయ్యవంతిపురి బ్రా
కామ్యత్వ వాల్లభ్యముల్

మొనపున్ సజ్జనకోటికిన్ పరమ
మౌ మోక్షంబు. రక్షించు తా

తన భక్తాళి నకాల మృత్యుకృత సం
త్రాసమ్ము పోద్రోలి-పా

యని ర క్తిన్ పరమేశు వేడెద భయా
హ ర్తన్ మహాకాలునిన్. ॥3॥

కావేరీ ప్రియ నర్మదా ప్రణయ వి
ఖ్యాతంపు కూటస్థలిన్
పావిణ్యంబున నొంటియై మహిత మా
మాంధాతృ రాజత్పురీ
దేవాగారమునన్ వసించి సుజనో
త్తీర్ణక్రియాకీర్తియై
కైవారమ్ముల నొందు నీశ్వరుని, ఓం
కారేశ్వరున్ కొల్చెదన్. ॥౪॥

తాదాత్మ్యంబున మౌని దేవ దనుజో
ద్యద్యక్ష. నాగావళుల్
పాదాబ్జంబుల జేరి కొల్తు రెవనిన్
భక్తిన్ భవుం డెవ్వ డా
మోదం బొప్ప మహాద్రి పార్శ్వతట స
త్పుణ్య ప్రదేశాన ఆ
కేదారమ్మున కొల్వుతీర్చె, అతనిన్
కీర్తింతు నత్యంతమున్. ॥౫॥

అక్షయ్యం బగు భక్తి వచ్చిపడి పై
ఆ శాకినీడాకినీ
రక్షోభూతపిశాచముల్ ఘనసమ
ర్చల్ సేయ రాగిల్లి లో
దాక్షిణ్యంబున బ్రోచు భక్తహిత మం
దారున్ మహాదేవు, ఫా
లాక్షున్ వేడెద భీమశంకరుని, లీ
లా తాండవాటోపునిన్. ॥౬॥

తా నెవ్వేళ ననాథనాథుడయి భ
క్తవ్రాతపాపఘ్నుడై
ఆనందం బను కాననంబున మహా
హ్లాదానుభోగంబుచే
నానందాద్భుతకందమై పరగు, నా
ర్యానాథు వారాణసీ
శ్రీనాథున్ ఘనవిశ్వనాథు గొలుతున్
శ్రేయోర్థినై నిత్యమున్. ॥౭॥

ఘన గోదావరి మూలదేశమున వి
ఖ్యాతంపు సహ్యాద్రిపై
తను దర్శించినవారి పాతకములన్
తర్జించి భర్జించి పెం
పున వేవేగ హరించి ప్రోచు ప్రభు-శం
భున్ త్ర్యంబకేశున్, సదా
వినుతింతున్ పరమానురాగమున, గా
వింపన్ శుభంబుల్ తమిన్. ॥౮॥

ఇలపై ప్రజ్వలికా నిధానమున న
య్యీశాన్యదిగ్భాగ మం
జులసీమన్ గిరిజాసమేతుడయి-సం
శోభిల్లు మృత్యుంజయున్
ఫలసందాయకు వైద్యనాథ భవు దీ
వ్యద్దేవ దైత్యార్చితో
జ్జ్వల పాదాబ్జు హృదబ్జ మిచ్చుకొని శ
శ్వద్భక్తి సేవించెదన్. ॥౯॥

సౌరాష్ట్రంబున యామ్యసీమ మహిత
స్ఫాయత్పదంగంబునన్
సారాలంకృత సర్వదేహుడు మహా
శౌండీరుడౌ భోగియై
ధీరప్రక్రియ భక్తిముక్తు లిడుచున్
దీపించు నే శంభుడా
హీరాళోజ్వల నాగనాథు శరణం
బే నొందెదన్ భక్తిమై. ॥౧౦॥

పారావార సుతామ్రపర్ణి తటినీ
భాస్వత్సుసంయోగ ల
క్ష్మీరమ్యస్థలి బాణసేతువును ర
క్తిన్ నిల్పి శ్రీరాము డే
పేరుంగన్న ప్రతిష్ఠ సేసి కొలిచెన్
విశ్వేశు నెవ్వాని-ఆ
శ్రీరామేశ్వరు నీశ్వరేశ్వరుని సు
శ్రీయుక్తు సేవించెదన్. ॥౧౧॥

గారామొప్పెడు నత్యుదారగుణ వి
ఖ్యాతిన్ జగద్వంద్యుడై
రారాజై భువిలో నిలాపుర పవి
త్రక్షేత్ర రమ్యస్థలిన్
ధీరత్వంబున బ్రోచి భక్తతతి సం
దీపించు ఘుశ్మేశ్వరున్
నే రక్తిన్ శరణంబు నొందెద మహా
నిశ్రేయస ప్రాప్తికై. ॥౧౨॥

ఫలశ్రుతి

తిరమై పొల్చెడు నీస్తుతిన్ వలచి జ్యో
తిర్మూర్తులౌ ద్వాదశ
స్థిరలింగంబులపైన శంకరుడు తా
జెప్పెన్-మహాభక్తి నే
నరు డిద్దాని పఠించునో యతడు పు
ణ్యంబైన సాలోక్య వి
స్ఫురదౌదార్యపదంబు తత్ఫలముగా
శోభిల్లు సత్యంబుగన్.

## శ్రీ టి. భాస్కరరావు
## "స్ఫూర్తిశ్రీ"

శ్రీరమ్య సువిశాల సౌరాష్ట్రదేశమున
భక్తి ప్రదాతయై ప్రాపించియున్నట్టి
జ్యోతిర్మయుని సుధాంశు కళా శిరోవతం
సుని శివుని సోమనాథుని శరణుపొందెదను॥౧॥

విపులాచలోన్నతము విబుధసన్నిహితమౌ
శ్రీశైలశిఖరి వేంచేసి ముదమున నున్న
మల్లికార్జునదేవు మహిత సంసారాబ్ధి
సేతువును వరనమస్కృతులతో సేవింతు ॥౨॥

కాపాడ జీవుల నకాల మరణమునుండి
మోదమున సాధులకు ముక్తిని ప్రసాదింప
అవతరించె నవంతియం దెవ్వ రామహా
కాళేశ్వరుని నమస్కారముల సేవింతు. ॥3॥

కావేరికా నర్మదా విమల సంగమ
స్థావరంబైన మాంధాతృపురమున నిల్చి
సంతతము సకల సజ్జన తారణము నల్పు
శివుని నోంకారేశుఁ జిత్తంబులోఁ గొల్తు. ॥४॥

క్రీడించుచు మహాద్రి కెలకులను సానువుల
దేవ రాక్షస యక్ష దివ్యముని బృందముల
పూజావిధుల నెల్లపుడు నందుకొనుచుండు
శివుని కేదార సంస్థితు నీశ్వరుని గొల్తు. ॥౫॥

శాకినీ డాకినీ లోక సంసేవ్యుఁడై
క్రవ్యాద సంఘ సంభావ్యుఁడౌ నీశ్వరుని
భక్తహితు భీమాది పద ముద్రితుండైన
శంకరుని వరనమస్కారముల సేవింతు. ॥౬॥

ఆనందవన మందు నావాస మొనరించు
ఆనందకందమును హతపాపబృందమును
శ్రీ విశ్వనాథు కాశీనాథు నాథనా
థుని నయ్యనాథ నాథుని శరణు పొందెదను॥౭

పావనోదార గోదావరీ తీరమున
సహ్యాద్రి విమల శీర్షమున నెలకొనియుండి
దర్శించినంత సత్వరము పాతక మెల్ల
హరియించు త్ర్యంబకేశ్వరు ప్రస్తుతుల గొల్తు॥౮॥

అమరాసురారాధితాంఘ్రినీరేజుఁడై
పార్వతీయుక్తుఁడై పూర్వోత్తరమునందు
తనరు ప్రజ్వలికానిధానమున నివసించు
శ్రీవైద్యనాథేశుఁ జిత్తంబులోఁ గొల్తు. ॥౯॥

రమ్యమైన సదంగ యామ్యనగరమునందు
ప్రత్యక్షమైయున్న భక్తి ముక్తి ప్రదుని
వివిధ భోగ విభూషిత విలాస శోభితాం
గుని నాగనాథేశ్వరుని శరణు పొందెదను.॥౧౦॥

తామ్రపర్ణీ సముద్ర శుభ సంగమమందు
సిత బాణ తతులచే సేతువును నిర్మించి
శ్రీరామచంద్రుఁడే పేరిడిన యట్టి యా
రామేశ్వరాఖ్యుని నిరంతరము సేవింతు. ॥౧౧॥

సువిశాల రమణీయమవు నిలాపురమందు
ఉల్లసించు నగణ్యు నుర్వీజన శరణ్యు
సముదారగుణు నమస్కారముల సేవించి
వినయమున ఘుశ్మేశ్వరుని శరణు పొందెదను.

ఫ ల శ్రు తి

ద్వాదశ సంఖ్యాత్మక సుశ్లోకము
జ్యోతిర్లింగ స్తోత్రాఖ్యాకము
పఠియించిన శివభక్తవర్యులకు
తద్దర్శన సమ ధన్యత కలుగును.

## శ్రీ అక్కిరాజు వేంకటేశ్వర శర్మ

సరసంబై విశదా ప్రసిద్ధమగు నా
సౌరాష్ట్ర దేశమ్ములో
స్థిరతం జంద్రకళావతంస! యిటు జ్యో
తిర్లింగ రూపంబుతో
కరుణన్ నిల్చితె సోమనాథపురి నో
కైలాసవాసా! భవ
చ్చరణంబుల్ శరణంబు నాకగు మహే
శా! సోమనాథప్రభూ! ॥౧॥

భూతప్రేత పిశాచ రాక్షస గణం
బుల్ గొల్వ మాహేశ్వర
వ్రాతంబుల్ తగ భీమశంకరములో
రౌద్రాకృతిన్ బాప సం
ఘాతంబుల్ నురుమాడి లోకములకున్
గళ్యాణమున్ గూర్ప సం
ప్రీతిన్ నిల్చిన భీమశంకర! సమ
ర్పింతున్ నమోవాకముల్. ॥౬॥

కైలాసంబునకన్న మిన్నయని గం
గా తీరమౌ కాశియం
దాలుంబిడ్డలఁగూడి యుంటివ? విశా
లాక్షీమనోనాయకా!
ఫాలాంకా దురితౌఘదూర! కరుణా
పారీణ! వారాణసీ
పాలా! దీనజనావనా! మము దయన్
బాలింపు విశ్వేశ్వరా! ॥౭॥

అల గోదావరి జన్మభూమియగు స
హ్యా ప్రాంతమౌ త్ర్యంబక
స్థలి నత్యంత పవిత్రభూమిని మహా
త్మా! త్ర్యంబకేశుండవై
కలి పాపౌఘము దర్శనంబుననె పో
కార్పన్ మృడా! నిల్చినా
విల నీవంటి ప్రసన్న దైవమెవఁడో
యీ! నిన్నె కీర్తించెదన్. ॥౮॥

ప్రావిర్భావము చెందినావ గిరిశా!
ప్రజ్వల్వి దేశంబులో
శ్రీవిద్యాధవ! వైద్యనాథపురిలో
శ్రీవైద్యనాథాఖ్యతోన్
దేవారాధిత పాదపల్లవ! భవా
నీ వల్లభా! కృత్తివా
సా! వందారువు నన్ను జేకొను మహే
శా! వైద్యనాథేశ్వరా! ॥౯॥

యామ్యంబైన సదంగమన్ పురము ర
మ్యం బందు వేంచేసి మా
కామ్యంబుల్ వెసఁ దీర్చి సర్వవిధ భో
గంబుల్ సదా పొందు నీ
సామ్యం బెందును లేదు భక్తసులభా!
సద్భక్తి ముక్తి ప్రదా!
రమ్యాకార! విభూషితాంగ! కయికో
రా! నాగనాథా! నతుల్. ॥౧౦॥

శ్రీరాముం డెట సేతునిర్మితిని వా
ర్థిం గట్టెనో త్రామప
ర్ణీ రత్నాకర సంగమం బెచట సం
దీపించెనో యల్లదే
శ్రీ రామేశ్వర పుణ్యతీర్థ మచటన్
శ్రీరామచంద్ర ప్రతి
ష్ఠారూఢిన్ జెలువొందు నిన్ గొలుతు ని
ష్ఠన్ రామలింగేశ్వరా! ॥౧౧॥

ఎల్లోరాకు సమీపమందుఁగల యీ
ఘృశ్మేశ్వరంబందు సం
పల్లాభంబు లొసంగగా వెలసి నా
వా? వేరులా చెంగటన్
ముల్లోకంబులఁ బ్రోచి యాత్రికులకున్
ముక్తిన్ బ్రసాదించి మ
మ్మెల్లన్ జల్లఁగఁ జూడుమా! శశిధరా!
ఘృశ్మేశ్వరా! సర్వదా! ॥౧౨॥

ఫలశ్రుతి

దివ్య ద్వాదశ తీర్థ రాజముల జ్యో
తిర్లింగముల్ గాంచి సం
భావ్యాద్వైత మతప్రవక్తయగు శ్రీ
మచ్ఛంకరాచార్యుఁ డీ
భవ్యస్తోత్రముఁ బల్కె భక్తిని బఠిం
పన్ దీనిఁ జేకూరెడిన్
దివ్యక్షేత్ర విలోక లభ్య ఫలముల్
నిత్య ప్రమోదంబులున్.

## శ్రీ బొడ్డు
## బాపిరాజు

శ్రీమదభిరామ సౌరాష్ట్రసీమ నిండు
కరుణ నెలకొన్న భక్తి భాగ్య ప్రదాత
నాశ్రయించెద బాలచంద్రావతంసు
సోమనాథుని జ్యోతిర్విశుభ్రమూర్తి. ॥౧॥

సాధు బుధ సంగతము తులాచల సుతుంగ
మలరు శ్రీశైలశృంగ మం దధివసించి
ప్రీతి సంసార వార్నిధి సేతువైన
మల్లికార్జునస్వామి కన్మన్నమస్సు. ॥౨॥

నతసుధీలోక మోక్షసంధాత యగుచు
నవతరించి యవంతీ పురాంతికమున
శ్రీ మహాకాళు డనగ రాజిల్లు ఫాల
నేత్రున కకాలమృత్యు శాంతికి నమింతు. ॥3॥

సరవి కావేరి నర్మదల్ సంగమించు
పావనక్షోణి మాంధాతృ పట్టణమున
శ్రితజనోద్ధార దీక్ష నిల్చిన ఫణీంద్ర
కంకణుని సన్నుతింతు నోంకారనాథు ॥4॥

ప్రథిత హిమశైల పార్శ్వమం దధివసించి
పరమయోగీంద్ర వరసురాసుర సమస్త
యక్ష కిన్నర పన్నగాభ్యర్చితాంఘ్రు
డైన కేదారనాథుని నభినుతింతు. ॥5॥

శాకినీ ఢాకినీ ముఖ్య సకల వికట
రాక్షస సమాజ పూజాభిరామ చరణు
శరణు వేడెద శశికళాభరణుడైన
భీమశంకరు కింకరక్షేమకరుని. ॥6॥

వినుతి గావింతు నానందవన వసంతు
కిల్బిష జిఘాంసు కైవల్యకృత్కృపాంశు
దీనజనబంధు నానందదివ్యసింధు
కాశికా విశ్వనాథు గంగాసనాథు. ॥౭॥

పుణ్య గోదావరీ తీరభూమి నెసగు
సహ్య గిరిశృంగ పీఠికాస్థాను డగుచు
సకల కలుషమ్ము లాత్మదర్శనము మాత్ర
పరిహరించు శ్రీత్ర్యంబకేశ్వరు నుతింతు. ॥౮॥

ప్రజ్వలిక నామ పూర్వోత్తర ప్రసిద్ధ
సీమ శ్రీమత్సురాసురార్చితపదాంబు
జాత రమణీయుడై శైలజాత గూడి
రంజిలెడు వైద్యనాథున కంజలింతు. ॥౯॥

యామ్య దిక్సంగత సదంగ రమ్యనగరి
వివిధ భోగి విభూషణాన్విత శుభాంగు
డగుచు భక్తిముక్తి ప్రదుండయి వెలుంగు
నాగనాథుండు శశిమౌళి నాకు శరణు. ॥౧౦॥

తామ్రపర్ణీ స్వయంగ్రాహ దర్పితాబ్ధి
ధృత ధనుర్బాణుడై వారధిని ఘటించు
స్వామి శ్రీరాముడు ప్రతిష్ఠ సల్పి నట్టి
రామలింగేశ్వరునకు ప్రణామశతము. ॥౧౧॥

శ్రీవిశాల మిలాపురసీమ వెలయు
విద్వదభిగణ్యు సర్వజగద్వరేణ్యు
సులభ కరుణా మహోదార సుస్వభావు
హరుని ఘుశ్మేశ్వరుని మ్రొక్కి శరణుగొందు. ॥౧౨॥

ఫ ల శ్రు తి

పరగు ద్వాదశజ్యోతిశ్శుభాంగ లింగ
సురుచిరస్తోత్ర మాదిశంకర కృతంబు,
యిది తెనుగుసేత దీని పఠించు జనుడు
పడయు తద్దేవ దర్శనప్రాప్యఫలము.

**శ్రీ మల్లంపల్లి**
**వీరేశ్వర శర్మ**

శమదమ్మై యతిరమ్యమై విశదమౌ
సౌరాష్ట్రదేశమ్మునన్
సమతాభక్తి వితీర్ణి దీక్షితకృపన్
సాక్షాత్కృతింగన్న యా
సుమనస్స్వామిని సోమనాథుని మహా
జ్యోతిర్మయున్ బాలచం
ద్రమఉత్తంసుని జొచ్చెదన్ శరణ మ
శ్రాంత మ్ముమాస్వాంతమున్. ॥౧॥

స్థిరనిర్వ్యాధ బుధప్రసంగమగు నా
శ్రీశైలశృంగమ్మునన్
గిరికన్యాకుచభూధరోదిత తులాం
గీకార రంగమ్మునన్
గరిమ న్నిల్చిన మల్లికార్జునున కే
కర్భాజికిన్ మ్రొక్కెదన్
చిరసంసారసముద్రసేతువునకున్
శ్రీముక్తిసంధాతకున్. ॥౨॥

అపమృత్యూగ్రతఁ ద్రోచి భక్తజన మ
త్యంతమ్ముఁ గాపాడు నా
కృపయే తానుగ నయ్యవంతిపురమం
దే కాపురమ్మైన వి
శ్వపతిన్, సజ్జనముక్తిదాననిరతిన్
భావింతు నస్మత్పతిన్
స్వపదాధఃకృతకాలకాలుని మహా
కాళున్ జగత్పాలునిన్. ॥3॥

అల కావేరియు నర్మదానదియు వి
యయ్యమ్మందు దేశమ్మునన్
గల మాంధాతృపురమ్మునందు జనతా
కైవల్యదానార్థ మిం
పొలయ న్నిల్చిన దేవునేఁ గొలుతు న
య్యోంకారనాథేశ్వరున్
విలసద్భారతమధ్యదేశనిలయున్
విశ్వప్రధానేశ్వరున్. ॥౪॥

అరుదారంగ హిమాద్రి పార్శ్వమునయం
దాసీనుఁడౌచున్ సురా
సురయక్షోరగసంయమి ప్రకర శు
శ్రూషల్ మది న్మెచ్చు, త
ద్గిరికన్యాచిరభాగధేయ మగు నా
కేదారనాథున్ మనో
మరువు న్నామకముర్వరన్ జలుప స
మ్యగ్భక్తి భావించెదన్. ॥౫॥

ప్రకటార్తావనదీక్షఁ గైకొని మహా
రాష్ట్రాఖ్యదేశమ్మునన్
వికటాభీలనరాశనాత్మరతిత
స్వీ శాకినీ ఢాకినీ
నికరమ్ముల్ భజియింప భీముఁ డగుచున్
విచ్చేసి భక్తాళి కో
రికలన్ దీర్చెడి శంకరుం గొలుతు గౌ
రీ భూషితార్ధాంగునిన్. ॥౬॥

అమితానంద మహావనాంతరమునం
దానందకందాకృతిన్
దమితాఘమ్మగు వారణాసిని, జగ
ద్రక్షావినిద్రస్థితిన్
దమి దానున్ దన యన్నపూర్ణయునుగాఁ
దానైన విశ్వేశు న
య్యమరద్వీపవతీసనాథుని విశా
లాక్షీవిభున్ మ్రొక్కెదన్. ॥౭॥

శమితాఘమ్మన మిన్నుముట్టినది యా
సహ్యాద్రిశీర్షమ్మునన్
గొమరారా, సార్థకనామ, నాసిక కడన్
గోదావరీతీర భూ
రమణీ పుణ్యఫలమ్ము, త్ర్యంబకుని, నా
రాద్దృష్టి మాత్రమ్మునన్
దమకుం దామగు మోక్షసంపదల, నం
తర్దృష్టి లక్షించెదన్. ॥౮॥

వెలయన్ బ్రజ్వలికాభిధాన మగు నా
బీహారదేశమ్మునన్
గొలువై జాయయు దానునా, నుపగయా
కూటమ్మునం బొల్చు, ను
జ్జ్వలు, నాథున్, భవవైద్యనాథుని సదా
ప్రార్థింతు నవ్వైద్య నా
థులసన్మూర్తి సురాసురార్చితపదున్
దుఃఖాబ్ధికుంభోద్భవున్. ॥౯॥

సమచిత్తమ్ము శుభాంగమౌ నగరిలో
సౌరాష్ట్రదేశమ్మునన్
రమణీయమ్మగు ద్వారకాపురికడన్
రాజోపచారమ్ములన్
గమనీయుండయి భుక్తిముక్తుల నిడం
గా నిందుకొల్వున్న, యా
సుమనోనాథుని, నాగనాథుని, ధునీ
చూడాలు సేవించెదన్. ॥౧౦॥

అల పౌలస్త్య వధాపరాధమది పా
యన్, దామ్రపర్ణీనదీ
జలరాశిస్ఫుటసంగమావనిఁ బ్రతి
ష్ఠాపించె, బాణౌఘ పి
చ్ఛలితాంభోనిధి సేతుహేతువగు నా
శ్రీరాముఁ డేస్వామి మూ
ర్తిలసత్త్ర్యయ్యవతారు నవ్విభుని భ
క్తిం గొల్తు రామేశ్వరున్. ॥౧౧॥

రమణీయమ్ము విశాలమై యల మహా
రాష్ట్రమ్మునన్ బుణ్య తీ
ర్థ మహిష్ఠమ్మగు నయ్యిలాపురమునన్,
భ్రాజిల్లు ఘుశ్మేశ్వరున్
యమదుర్దర్శనిజాంఘ్రిసేవకు మహా
దారాత్ము, దారాత్మ మం
జిమ సర్వస్వముఁ జొచ్చెదన్ శరణమున్
సిద్ధాత్మ సర్వస్వమున్. ॥౧౨॥

ఫ ల శ్రు తి

చేతోవీథి దలంతు నిచ్చలు కృపా
స్నిగ్ధాకృతిన్ ద్వాదశ
జ్యోతిర్లింగమయాక్షరాకృతి సర
శ్శుభ్రాబ్జహంసాకృతిన్
ప్రీతిస్విన్నషడాననాక్షియుగప
న్నిర్యన్మహాస్వీకృతిన్
నేతిజ్ఞాన నిదాన ముక్తిలలనా
హృష్టాత్మ దూతీకృతిన్.

## శ్రీ కంభంపాటి
## రామగోపాలకృష్ణమూర్తి

విమల సౌరాష్ట్రదేశాన వెలసియున్న
దేవు, జ్యోతిర్మయు, శశికలావతంసు
భక్తులకు నెల్ల దయఁ జూపి భక్తి నిచ్చు
సోమనాథుని శరణంబు సొత్తు నెపుడు. ॥౧॥

అల్ల శ్రీశైలమందు తులాద్రి శిఖర
మందు, జేజేల కాటపట్టైన చోట
నధిక సంతుష్టి నివసించు నాదిదేవు,
మల్లికార్జునదేవు నమస్కరింతు. ॥౨॥

సజ్జనాళికి ముక్తిసంస్థాన మొసఁగి
దక్షత నకాలమృత్యు సంరక్షసేయ
నుజ్జయిని యందు నవతార మొందియున్న
ఆ మహాకాళుఁ గొల్తు మహామరేంద్రు. ॥3॥

కలిత కావేరి నర్మదల్ కలియుచోట
నెన్ని మంధాతృపురమున నున్నదేవు
సజ్జనావన తారణ శక్తియుక్తు
నద్వితీయు నోంకారేశు నభినుతింతు. ॥౪॥

చలువకొండకుఁ బ్రక్కనఁ జఱియనుండి
దేవ దానవ యక్షోరగావళులకు
నఖిల మౌనులకును బూజ్యుఁడైన శివుని
నద్వితీయుఁ గేదారేశు నభినుతింతు. ॥౫॥

శాకినీ డాకినీ దైత్యసంఘ సేవ్యు
భీమశంకర తీర్థాభివిష్టచిత్తు
భీమనామాది పదగేయు భీమకాయు
భీమశంకరదేవు సంప్రీతిఁ గొల్తు. ॥౬॥

భావితానందుఁ డానంద వనమునందు
డెంద మానంద మంద, నందందఁ బాప
బృందములు డిందగా, నివసించు కాశి
నాథు శరణంబు సొత్తు ననాథనాథు
విశ్వ సంకీర్త్యగాథు శ్రీ విశ్వనాథు. ॥౭॥

భవ్య గోదావరీ తీర దివ్యదేశ
విమల సహ్యాద్రి శిఖరాన వెలసి, దర్శ
నంపు వేళనె పాతక హారియైన
అల్ల త్ర్యంబకేశుని నెప్పు డభినుతింతు. ॥౮॥

ఈశాన్య దేశమందున
నీశానినిఁగూడి ప్రజ్వలిని వెలసిన గౌ
రీశుని సురాసురార్చితు
శ్రీ శేద్యుని వైద్యనాథుఁ జేతులొ్మొడ్తున్. ॥౯॥

యామ్యదిక్కున రమ్య సదంగపురిని
వివిధభోగాల నిచ్చలు వెలయుచున్న
భక్తిముక్తిప్రదున్ నిత్యు భవహరేశు
నాగనాథుని శరణని నతులుసేతు. ॥౧౦॥

వారధియుఁ దామ్రపర్ణియు భవ్యసంగ
మైన చోటను బాణాల నడ్డుకట్టి
నిష్ఠ శ్రీరామచంద్రప్రతిష్ఠితుండు
నైన రామేశ్వరు న్నెమ్మి నభినుతింతు. ॥౧౧॥

పుణ్య రమ్యాయతము నిలాపురమునందుఁ
గామితోల్లాస భాసు, జగద్వరేణ్యు
స్థాణు ఘుశ్మేశ్వరాఖ్యు నుదారభావుఁ
జరణముల సాగి, కేల్మోడ్చి, శరణుసొత్తు ॥౧౨॥

ఫ ల శ్రు తి

శంకరాచార్య రచితంబు, సర్వశంక
రాత్మ ద్వాదశ జ్యోతిర్మయాఖ్య లింగ
రాజస్తోత్రము భక్తిఁ బ్రార్థనము సేయు
నరుఁడు దర్శనముక్తుల నరయుఁగాత!



శ్రీ పినపాల వేంకట గోపాలరావు

## శ్రీ డా॥ పి. వేంకట గోపాలరావు

ప్రముఖ విశదాతిరమ్య సౌరాష్ట్రభూమి
నలరు జ్యోతిర్మయు, శశికళావతంసు
నమల భక్తి ప్రదాన కృపావతీర్ణు,
సోమనాథుని శరణమ్ముఁ జొచ్చువాఁడ. ॥౧॥

అఖిల విబుధాతిసంగ తులాద్రితుంగ
మైన శ్రీశైలసంగమం దధివసించు
నద్వితీయు, సంతోషి, భవాబ్ధితరణి
మల్లికార్జునస్వామి నెమ్మదిని గొలుతు. ॥౨॥

సుజన ముక్తిప్రదానార్థ సుస్థిర ప్ర
యత్నుని నవంతికా విహితావతారు
దారుణాకాలమృత్యు సంహారు, వినుతిఁ
జేసెదను మహాకాల మహాసురేశు. ॥3॥

సహ్యజా నర్మదా దివ్య సంగమమున
సజ్జనోద్ధరణార్థము, సంతతమ్ము
వాసి, మాంధాతృ నగర నివాసియైన
యీశు నోంకారు శివు నుతియించువాఁడ. ॥౪॥

ఉరు సురాసుర యక్ష మహోరగాది
నుతు, మునీంద్ర సంపూజ్యమానుని సతమ్ము,
శ్రీ మహాద్రి పార్శ్వస్థలిఁ గ్రీడ సల్పు
దేవుఁ గేదారునాథు నుతింతు శివుని. ॥౫॥

కలిత డాకినీ శాకినికా సమాజ
మాంసభోజనాతినిషేవ్యమాణుఁ డెవఁడు
వాని భీమాదిపదరూఢు, భక్తహితుని
శంకరుని, శంకమాని యశ్రాంత మెంతు. ॥౬॥

భవుని, సానందు, నానందవననివాసిఁ,
బరమ మోక్షకందుని, హతపాపబృందు,
సాధుఁ, గాశికానాథు, ననాథనాథు
వరదు, శ్రీవిశ్వనాథుని శరణుఁజొత్తు, ॥౭॥

దివ్యతరమగు గౌతమీ తీరభూమి,
సహ్యగిరి శిఖరాన నేస్వామి విడిది,
యేని దర్శించునంత క్షయించు నఘము,
వానిఁ ద్ర్యంబకుఁ గొల్తు నీశాను భక్తి. ॥౮॥

కడ దెసన్ బొల్చు ప్రజ్వలికానిధాన
సంతతావాసియౌ గిరిజాసమేతు,
బహు సురాసురారాధిత పాదపద్ము,
వలచి భజియింతు మదిని శ్రీవైద్యనాథు. ॥౯॥

యామ్యదిశ రమ్యమై సదంగాఖ్యనలరు
పురి, విభూషితుండును బహుభోగియైన
-ఘనుని సద్భక్తి ముక్తిప్రదుని మహేశు
శర్వు శ్రీనాగనాథుని శరణుఁ జొత్తు. ॥౧౦॥

కడలియు సుత్రామపర్ణియుఁ గలియుచోట
బాణమయమగు సేతు నిర్మాణ మెవఁడు
తీర్చె నా రామచంద్ర ప్రతిష్ఠితుఁడయి
వెలయు రామేశ్వరాఖ్యునిఁ బేర్మిఁ గొలుతు॥౧౧॥

అతి విశాలమ్ము రమ్యమ్మునౌ నిలాన
గరమున సముల్లసిల్లు జగద్వరేణ్యు
రమ్యగుణ మహోదారతరస్వభావు
నెంతు, శరణంబు సొచ్చి ఘుశ్మేశ్వరాఖ్యు॥౧౨॥

ఫలశ్రుతి

వర గురూక్తమ్ముఁ బరమ శివాత్మకము, భృ
శమ్ము ద్వాదశలింగస్తవమ్ము, విన్నఁ
గన్నఁ జదివిన మనుజుండు గాఢభక్తి
నైజఫలము మోక్షమ్ము నొందఁగఁజాలు.

## శ్రీ ధనకుధరం
## వేంకటాచార్యులు

ఖ్యాతము బహుసౌందర్యో
పేతము సౌరాష్ట్రమందు వెలయు దయాళున్
జోతల శరణము వేడెద
జ్యోతిర్మయు 'సోమనాథు' నుడుపతిముకుటున్.

తులనాద్రి నామకము బుధ
నిలయము శ్రీశైలమందు నెలకొని, భవమన్
జలనిధి సేతువునౌ మం
గలకరు ప్రణుతింతు 'మల్లికార్జునదేవున్' ॥౨॥

ఇజ్జగ మకాల మృత్యు ని
మజ్జనమున్ గాకయుండ మన్నించు శివున్
సజ్జన మోక్షప్రాపణు
ఉజ్జయినీ 'కాళనాథు' నూహింతు సదా. ॥3॥

పదపడి కావేరీ న
ర్మదానదీ సంగమమున మాంధాతృపురిన్
పదమూని భక్తముక్తి
ప్రదుడగు 'నోంకారనాథు' ప్రార్థింతు మదిన్.॥౪॥

నిరతము యక్షసురాసుర
గరుడోరగ ముని వరాది కల్పిత పూజా
పరునిన్ 'కేదారేశున్'
పరమున్ గొల్తును మహాద్రిపార్శ్వతటస్థున్.॥౫॥

ఢాకినులు పిశాచమ్ములు
శాకినులున్ గొలువ 'భీమశంకరు' డనగా
లోకఖ్యాతిన్ బడసిన
శ్రీకరు భక్తానురాక్తు శివు సేవింతున్. ॥౬॥

సానంద మ్మానందో
ద్యానము మందిరముగా మహాఘుశమనుడౌ
దీనశరణ్యుని కాశీ
స్థానున్ 'శ్రీవిశ్వనాథు' శరణు భజింతున్. ॥౭॥

గోదావరీ నదీ తట
మేదిని సహ్యాద్రిపైన మెలగుచు పాప
క్షోదన దర్శన మొసగు మ
హాదేవున్ 'త్ర్యంబకేశు' ధ్యానింతు నెదన్. ॥౮॥

గిరిజా సమేతుని, సురా
సురసేవితపాదపద్మ శుభకరు, పూర్వో
త్తర దిక్ ప్రజ్వలికాధిపు
స్మరింతు 'శ్రీవైద్యనాథు' సతతము భక్తిన్. ॥౯॥

తత భక్తిముక్తిదాయకు
వితత సదంగపురవాసు వివిధ విధాలం
కృత భోగిన్ శరణమ్మని
స్తుతింతు 'శ్రీనాగనాథు' దుర్గానాథున్. ॥౧౦॥

జలరాశి తామ్రపర్ణియు
జలకములాడుకొనుచోట శరసేతువు పెం
పొలసెడు నెడ శ్రీరాముడు
నిలిపిన 'రామేశ్వరాఖ్యు' నెమ్మదిఁదలతున్॥౧౧॥

సువిశాల మిలాపురమున
నివసించు నుదారభావు నిఖిల జగద్వై
భవు, భవు 'ఘుశ్మేశ్వరునిన్
ప్రవిమలమతినంజలించి ప్రాపకమెంతున్॥౧౨॥

ఫ ల శ్రు తి

పరమ శివాత్మకమ్ములు ప్ర
పన్నశరణ్యము లంబికా మనో
హరములు జ్యోతిరంకితము
లౌ పదిరెండగు లింగమూర్తులన్
గురిచిన స్తోత్ర మియ్యది అ
కుంఠితభక్తి పఠించు మానవుల్
పరువడి తద్విలోకన ఫలమ్ము
భజింతు రసంశయమ్ముగన్!

## క రు ణ శ్రీ

శీతాంశుం దలదాల్చి చల్లనిసుధల్
చిందించుచున్ సజ్జన
వ్రాతంబున్ గరుణింప నింపయిన సౌ
రాష్ట్రప్రదేశమ్మునన్
జేతోమోదముతో వెలుంగుదువటే
శ్రీ "సోమనాథుండవై"
జ్యోతిర్లింగమయా ! దయార్ద్రహృదయా !
జోహారు మృత్యుంజయా ! ॥౧॥

చేతుల్ మోడ్చి యమర్త్యు లెల్లరు సమ
ర్చింపన్ మహైశ్వర్యముల్
చేతం బూని తులాద్రితుంగమగు నా
శ్రీశైలశృంగాన సం
ప్రీతిన్ నిల్చు భవాబ్ధిసేతువవు స్వా
మీ నీవు "మల్లీశ్వర"
జ్యోతిర్లింగమయా! దయార్ద్రహృదయా!
జోహారు మృత్యుంజయా! ॥౨॥

ప్రాతర్భాను మరీచిమాలికలు పై
పై ప్రాక, శిప్రానదీ
వాతంబుల్ మెయి సోక, మృత్యువును ద్రో
వన్, భృత్యులం బ్రోవ, ప్ర
ఖ్యాతిం గంటి వవంతికాస్థలి "మహా
కాళేశ్వర" స్వామివై
జ్యోతిర్లింగమయా! దయార్ద్రహృదయా!
జోహారు మృత్యుంజయా! ॥3॥

ఖ్యాతంబై పరిపూతమౌ ప్రవిలసత్
కావేరికా నర్మదా
ద్వైతప్రాంగణ సన్నివేశమగు మాం
ధాతృప్రదేశంబునం
దో తండ్రీ ! వెలుగొందుచుందువట నీ
"వోంకారనాథుండవై"
జ్యోతిర్లింగమయా! దయార్ద్రహృదయా !
జోహారు మృత్యుంజయా ! ॥४॥

శీతాహార్యతటాంచలమ్ములపయిన్
సిద్ధుల్ మునుల్ దేవతల్
దైతేయుల్ భజియింప శైలతనుజా
తం గూడి గంధర్వ సం
గీతంబుల్ విను నిన్ గనుంగొనుదు శ్రీ
"కేదారనాథాహ్వాయ"
జ్యోతిర్లింగమయా ! దయార్ద్రహృదయా !
జోహారు మృత్యుంజయా ! ॥౫॥

భూతప్రేత పిశాచ దైత్య నివహం
బుల్ శాకినీ డాకినీ
జాతంబుల్ తలలొగ్గ భక్తజన ర
క్షాదక్షదీక్షన్ జగ
ద్భీతిం బాపెడి "భీమశంకరుఁడవై"
భీమాతటోద్భాసివౌ
జ్యోతిర్లింగమయా ! దయార్ద్రహృదయా !
జోహారు మృత్యుంజయా ! ॥౬॥

శీతక్ష్మాధరరాజపుత్రి కరముం
జేసేత గీలించి వి
ఖ్యాతానందవనీ విహారముల నా
హ్లాదించు స్వామిన్ నుతుల్
సేతున్ నిన్ను ననాథనాథు శివు కా
శీ "విశ్వనాథేశ్వరున్"
జ్యోతిర్లింగమయా ! దయార్ద్రహృదయా !
జోహారు మృత్యుంజయా ! ॥౭॥

చైతన్యోజ్జ్వల నిత్యనిర్మల మహా
సహ్యాద్రిపై గౌతమీ
స్రోతఃపూత తటాన నిన్ గనిన ని
ర్ధూతంబులౌ పాతక
వ్రాతంబుల్; మురిపించు ముక్తిరమ; దే
వా! "త్ర్యంబకేశాహ్వయ"
జ్యోతిర్లింగమయా! దయార్ద్రహృదయా!
జోహారు మృత్యుంజయా! ॥౮॥

పూతప్రజ్వలికాభిధాన ధరణిన్
బూర్వోత్తరన్ దేవతా
దైతేయార్చిత పాదపద్మముల నా
స్థానించి, శర్వాణి వా
క్చాతుర్యంబుల కిచ్చు మెచ్చెదవు నిచ్చల్
"వైద్యనాథాహ్వయ"
జ్యోతిర్లింగమయా! దయార్ద్రహృదయా!
జోహారు మృత్యుంజయా! ॥౯॥

## అనువాదకుల పరిచయము

### శ్రీ విశ్వనాథ సత్యనారాయణ

జననము 10-9-1895 కృష్ణాజిల్లా నందమూరులో, "కవి సమ్రాట్" బిరుదాంకితులు, సంస్కృతాంధ్రాంగ్ల భాషా నిష్ణాతులు. బందరు హిందూ కళాశాలలో, గుంటూరు ఆంధ్ర క్రైస్తవ కళాశాలలో, విజయవాడ యస్. ఆర్. ఆర్. & సి. వి. ఆర్. కళాశాలలో ఆంధ్రోపన్యాసకులుగా పనిచేసినారు. కరీంనగర్ ప్రభుత్వకళాశాల ప్రిన్సిపాలు పదవి నిర్వహించిరి. ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీ ఉపాధ్యక్షులుగ పనిచేసిరి. వీరి కృతులు :- అమృతశర్మిష్ఠం, దేవీత్రిశతి, ఆంధ్రప్రశస్తి, శృంగారవీధి, వరలక్ష్మీత్రిశతి, తెలుగు ఋతువులు, విశ్వనాథ మధ్యాక్కరలు, కిన్నెరసాని పాటలు, శ్రీమద్రామాయణ కల్పవృక్షము, వేయి పడగలు, ఏకవీర, చెలియలికట్ట, ధర్మచక్రము, వేనరాజు, త్రిశూలము, నర్తనశాల మున్నగునవి.

### శ్రీ పళ్ళె పూర్ణప్రజ్ఞాచార్యులు

జననము 15-6-1897 నెల్లూరుజిల్లా సంగం గ్రామములో. "మహోపాధ్యాయ" "కవిశేఖర" బిరుదాంచితులు. భాష్యాంత వైయాకరణులు. అవధాన విద్యానిపుణులు, ఆశుకవితాధురీణులు. గుంటూరు హిందూకళాశాలలో సంస్కృతాంధ్రోపన్యాసకులుగ పనిచేసిరి. వీరి కృతులు ఆంధ్రకాదంబరి, శ్రీరామకల్యాణము, కైకేయీ సౌశీల్యము, శతలక్షణి, కావ్యాలోకము మొదలగునవి.



తమ ఇరువురు కుమార్తెలు అల్లుండ్ర నడుమ
శ్రీ కాశీవిశ్వనాథము

## శ్రీ దోమా వేంకటస్వామిగుప్త

జన్మస్థానము కర్నూలు. శ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు వీరి కవితా గురువులు. అవధాని పంచానన, శతావధాని, కవి భూషణ, కవిచక్రవర్తి, సాహిత్య సరస్వతి, ఆంధ్ర విద్యా వాచస్పతి బిరుదాంకితులు, మద్రాసు క్రిస్టియన్ కాలేజీలోను, విజయవాడ యస్. ఆర్. ఆర్. సి. వి.ఆర్. కాలేజీలోను. ఆంధ్రా ధ్యాపకులుగ పనిచేసిరి. వీరి కృతులు బ్రహ్మేశ్వర పురాణము, గౌతమక్షేత్ర మాహాత్మ్యము, సుజనత్రయము, ఆత్మబోధ, దూతాంగదము, శ్రీకృష్ణరాయ చరిత్రము, విమలానందము, ప్రేమాభిరామము, బ్రహ్మవైవర్త పురాణము మున్నగునవి.

## శ్రీ ముదిగొండ వీరభద్రమూర్తి

జననము 8-8-1908 గుంటూరుజిల్లా సత్తెనపల్లి తాలూకా మాదలలో. సంస్కృతాంగ్లభాషలలో చక్కని అభినివేశము కల వారు. విద్వత్కవులు, వీరికృతులు మల్లికార్జున పండితవిజ యము, ఆంధ్రకేసరి, కామాక్షీపంచశతి (మూక పంచశతి కను కరణము), వాసవదత్త (సుబంధురచన కనువాదము) వేణు గోపాల శతకము మున్నగునవి.

## శ్రీ వావిలాల సోమయాజులు

జననము 19-1-1918 గుంటూరుజిల్లా విప్రులపల్లె అగ్ర హారములో. "కుమార ధూర్జటి" "కవిభూషణ" "మధురకవి" "సాహిత్యాచార్య" బిరుదాంచితులు. గుంటూరు శారదా నికేత నము ప్రిన్సిపాలుగా చాలకాలము పనిచేసిరి. ప్రస్తుతము గుంటూరు హిందూ కళాశాలలో ఆంధ్రోపన్యాసకులుగా నున్నారు.

వీరి కృతులు నాయకురాలు, వసంత సేన, వధూసర, ధర్మఘంటిక, మణిప్రవాళము, వాత్స్యాయన కామసూత్రములు, ఆంధ్రుల నాట్యము-సంగీతము, కామదహనము, ఏకశిల ఇత్యాదులు. షేక్స్పియర్ నాటకములను పెక్కింటిని యథామాతృకముగ ననువదించిరి. 'కామాయని' హిందీ మహాకావ్యమును అనువాదము చేయుచున్నారు. ఆంధ్రప్రదేశ సాహిత్యఅకాడమీ సభ్యులు.

## శ్రీ టి. భాస్కరరావు

జననము 1928 జనవరి తూర్పుగోదావరిజిల్లా కాకినాడలో. కవితానామము "స్ఫూర్తిశ్రీ". గుంటూరు ఆంధ్ర క్రైస్తవ కళాశాలలో ఆంధ్రోపన్యాసకులుగ పనిచేయుచున్నారు. ఆంధ్ర సంస్కృత సాహిత్యములయందును ఆంగ్ల హిందీ సాహిత్యముల యందును మంచి అభినివేశము కలవారు. వీరికృతులు దేవయాని, కన్నీటిజాలు, అహల్య, మహాశ్వేత, పరిణతి, ఆనందమఠము, శేషకవిత, శకుంతల, మాటలతో మంతనాలు, మాటలంటే మాటలా, మధుపాలిక, స్ఫూర్తిశ్రీ వ్యాసావళి, తెలుగు భాషా చరిత్ర మున్నగునవి,

## శ్రీ అక్కిరాజు వేంకటేశ్వర శర్మ

జననము 7-9-1925 పల్నాడుతాలూకా గుత్తికొండ గ్రామములో, ఆంధ్రమున "విద్వాన్" సంస్కృతమున "సాహిత్య శిరోమణి" పట్టములందుకొన్నారు. గుంటూరు ఆంధ్ర క్రైస్తవ కళాశాలలో ఆంధ్రోపన్యాసకులుగ పనిచేయుచున్నారు. వీరి కృతులు శృంగార తరంగిణి (అమరుకకావ్యమునకు పద్యానువాదము) రఘువంశము (కాళిదాస మహాకావ్యమునకు గద్యానువాదము) ఇత్యాదులు.



మాణిక్యములవంటి మనుమలతో మనుమరాండ్రతో
మనికొండ కాశీవిశ్వనాథము

## శ్రీ బొడ్డు బాపిరాజు

జననము 1912 జనవరిలో, జన్మస్థలము పశ్చిమగోదావరి జిల్లా ఏలూరు. సంస్కృతాంధ్ర సాహిత్యములందును హిందీ బెంగాలీ సాహిత్యములందును చక్కని అభినివేశము కలవారు. ఏలూరు 'సాహిత్యమండలి' ప్రముఖ సభ్యులుగ మాత్రమేగాక ఉపాధ్యక్షులుగ నధ్యక్షులుగ పదవీనిర్వహణము గావించిన సహృదయులైన సంపన్నులు. వీరికృతులు విపంచి (ఖండకావ్య సంపుటము), కాత్యాయని (శిశుగేయమాలిక), కలిక (కథాసంచయము) మున్నగునవి.

## శ్రీ మల్లంపల్లి వీరేశ్వర శర్మ

జననము 5-10-1916 బందరులో. సంస్కృతాంధ్రముల యందు చక్కని పాండిత్యముకలవారు. చిట్టిగూడూరు సంస్కృత పాఠశాలలో అధ్యాపకులుగ పనిచేసిరి. ప్రస్తుతము గుంటూరులోని సంస్కృత కళాశాలయందు అధ్యాపకులుగ నున్నారు. వీరి కృతులు : రఘువంశము, కాంచీఖండము, ఉత్తరనైషధము, ఉత్తమమనుసంభవము, పంపావిరూపాక్షము, అభినవశాకుంతలము, దుర్గాశతకము, మృత్యుంజయశతకము, వీరభద్రోదాహరణము, దుర్గాత్రిశతి, మల్లికార్జునసుప్రభాతము, శివమణిదర్పణము మున్నగునవి.

## శ్రీ కంభంపాటి రామగోపాలకృష్ణమూర్తి

జననము 2-7-1928 పశ్చిమగోదావరిజిల్లా తణుకు తాలూకా ముక్కామలలో. తర్క, వేదాంత, వ్యాకరణ విద్యాప్రవీణులు. బి. ఏ., భాషాప్రవీణ పరీక్షలందుత్తీర్ణులు. విజయవాడ గాంధీ నగరంలోని హిందూ హైస్కూలులో ప్రధానాంధ్రోపాధ్యాయు